## న వ ల లు

| | | రూ | అ |
|---|---|---|---|
| రమాసుందరి | 1 వ భా॥ | 1 | [illegible] |
| డిటో | 2 వ భా॥ | 1 | [illegible] |
| రక్తవాహిని (అయిదు హత్యలా ?) | | 1 | [illegible] |
| ఇంద్రజాలము | | 0 | 12 |
| రాజద్రోహి | | 0 | 12 |
| అర్ధరాత్రపు వింత (3 హత్యలు) | | 0 | 12 |
| దురాశ | 1 వ భా॥ | 1 | 0 |
| డిటో | 2 వ భా॥ | 1 | 0 |
| దొంగలనాయకుడు | | 1 | 0 |
| మోహపిశాచము | 1 వ భా॥ | 0 | 12 |
| డిటో | 2 వ భా॥ | 0 | 12 |
| కాలసర్పము | 1 వ భా॥ | 0 | 12 |
| డిటో | 2 వ భా॥ | 0 | 12 |
| విషహృదయము | | 1 | 0 |
| పటపులరాణి | | 1 | 0 |
| వంగలత | | 1 | 0 |
| నే నెవరి భార్యను ? | | 1 | 0 |
| నే నెవరి భర్తను ? | | 1 | 0 |
| వ్యామోహము | | 1 | 0 |
| జీవనప్రభాతము (రఘునాధజీ) | | 1 | 8 |
| జీవనసంధ్య (తేజసింగు) | | 1 | 8 |

# పగటి చుక్క


గ్రంథకర్త:

పిల్లలమర్రి గోపాలకృష్ణయ్యగారు

తెనాలి



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి




[వెల 1—0—0

# విషయసూచిక



రాజమహేంద్రవరము : శ్రీకొండపల్లి ముద్రాశాలయందు
ముద్రింపబడియె. ఇ. జి. 14—1000—1945

# ప గ టి చు క్క

## మొదటి ప్రకరణము

### దా స రి ప ల్లి

కనకపురమునకుఁ బశ్చిమమున ముప్పదిమైళ్ళలోపుగ ననేక గ్రామములు గలవు. వానిలో దాసరిపల్లి యనునది యొకటి. దాసరిపల్లి యొకమాదిరి పెద్దగ్రామము. అందు నుమారు మూఁడువందల గడప యుండెను ఇరువదిలోపుగ గ్రామములో నచ్చటచ్చట మిద్దెలు గలవు. ఈమిద్దెలయం దొకదానిలోనికిఁ జదువరులను బ్రవేశపెట్టెదము.

ఈమిద్దె యూరికి నుత్తరపువైపున నుండెను. దీని నిర్మాణము జరిగి చాలకాలము గడచెనని యాకృతి చూచి నంతనే చెప్పవచ్చును. తలుపులు పురాతనపు మాదిరివి. కట్టడము పురాతనము. గోడలపైని వికృతపుబొమ్మలు, గృహావనతి, ప్రక్కనజావడి — అన్నియుఁ బురాతనము. ముఖ ద్వారముపై రెండు కొయ్యగుఱ్ఱపు తలకాయలు గ్రుడ్లు మిటకరించుచుండెను. వానిపై గోడమీఁద పెద్దతోకతో ఎత్తిని

ఆంజనేయునిబొమ్మ నిర్లక్ష్యముగఁ జిత్రింపఁబడి యుండెను. ఇట్టి స్వల్పవిషయములు సహితము గృహము పూర్వకాలపుదని నొక్కి చెప్పుచుండెను.

లోపల నొకగదిలో ప్రాఁతతివాసీపై మాణిక్యము కూర్చుండి, ముఖముపై కెత్తి తనకుఁ గొలఁది దూరమున నిలిచి యున్న పురుషోత్తమరావుతో నేమియో గంభీరముగాఁ బ్రసంగించుచుండెను. పురుషోత్తమరావు నిర్లక్ష్యభావముతో నిలచెను ఆతని నేత్రములును, చూపులును మోహావేశ భావము నొలికించుచుండెను మాణిక్యము వదన మతిసాహస సూచకమై యామె మనస్థైర్యమును వెలిబుచ్చుచుండెను.

'కాఁబట్టి—కాఁబట్టి—నామాటవినవు. వినవుగాదా?' అని పురుషోత్తమరావు గంభీరస్వరముతోఁ బలికెను.

'నీమాట కాదు—నీనీచపుసలహా!' అని యాజవ్వని హేయభావముతో సమాధానము చెప్పెను.

'నానీచపు సలహా! నేను నీచుఁడనా?'

'కాదా మఱి?'

'కాదు. పిల్లా నీవు పొరఁబడుచున్నావు. నేను నీచుఁడనుకాను. నీవు కృతఘ్నురాలవు—మఱియు—'

'అయ్యో! మీదూషణ కట్టిపెట్టుఁడు!'

'మాణిక్యం! నీవు పిచ్చిదానవు'

'మీకంటెనా?'

'మా మ్మాటికిని'

'నా అభిప్రాయము వేఱు'

'సహజమే'

'మీకువలెనే'

పురుషోత్తమరావు నామెను కొలఁదిగ సమీపించెను. తటాలున మాణిక్యాంబ నిసుఱుగ లేచెను. ఆమె వాడిచూపునకు బెదరి యామోహాంధుఁడు నిర్ఘాంతపోయి వెనుకంజవేసెను.

'మర్యాదగా దూరముగ నుండుము. సమీపమునకు వచ్చిన—నా—నా—స్త్రీ సాహస మెఱుఁగవా?

'ఏమి చేసెదవు?'

'నీవో, నేనో'

'దీనురాలవే!'

'నాధైర్యమును బరీక్షింపకుము. భద్రముసుమా!'

పురుషోత్తమరావు రెండడుగులు వెనుకకు వేసి గోడ నానుకొనెను. అతనిదృష్టి మాత్రము సుందరి ముద్దుమోము నుండి మరలలేదు. అతఁడు దానిని త్రిప్పఁజాలఁడు. అంత దృఢముగా నది యట నతుకుకొనెను. మాణిక్యాంబ తిరిగి యాసీనకాలేదు. కూర్చుండఁదలచుకొన లేదు.

రెండు నిముషములట్లు గడచెను. ఎట్టకేలకు మిక్కిలి శాంతముగా వక్షముపై జేతులు మడిచి యిట్లనెను.

'నేను నిన్ను బలవంతముగా—'

'నీజన్మలోఁ జేయఁజాలవు!' అని భయంకరముగా నుచ్చరించుచు మాణిక్య మాతని కడ్డమువచ్చెను.

'ఏమి చేయఁజాలను?'

'నన్నంటఁజాలవు'

'చూచెదవు'

'ప్రేలకుము. పతివ్రత మానభంగసమయమున భూతముగా మాఱి ఎదుటి వారిని హతము చేయును."

"నీవు పతివ్రతవా?" అనుచు పురుషోత్తమరావు వికట మందహాస మొనరించెను.

మాణిక్యము నిరుత్తరయాయెను.

"నీకేపతియందు వ్రతము?" అనుచు నాతఁడు పరిహాసముగా, ధిక్కారముతో నడిగెను.

"నాప్రాణపతియందు."

పురుషోత్తమరావు వదనమున గాంభీర్య మొక్కమారుగ నుబికెను.

"నీప్రాణపతియా?"

"అవును."

"ఆతఁడెవ్వఁడు?"

'నీకనవసరము.'

'చెప్పఁగూడదా?'

'చెప్పను'

'పేరు చెప్పుము.'

'దేనికి?'

'విని సంతసించెదను.'

'తుచ్ఛుఁడా నీవాతని నేమియుఁ జేయఁజాలవు. విని దుఃఖించుము. చెప్పెదను.'

'చెప్పుము.'

'జనార్దనరావు'

మాణిక్యమాంబ ముఖమును బరిశీలించెను. అందెట్టి మార్పును జరుగలేదు. పురుషోత్తమరావు గంభీరముగా యోచించుచుండెను.

'మాణిక్యం! నేననిన నీకేల రోఁత?' అని యాతఁడు కొంతకాల ముండి శాంతముగా నడిగెను.

'నీచర్యలచేత'

'నేనేమి చేసితిని?'

'నన్ను వంచన.'

'ఆవిషయము నేరమా? అది నామోహాతిశయమును జూపుచున్నది. నాకోరిక వినవా?'

'మన యిరువురిలో నొకరు బ్రతికియుండగా పొసగదు'

'నేఁటిరాత్రి మఱియొకమారు సాహసముప్రయత్నించెదను. అది కడసారి సుమా.'

'తరువాత?'

'నన్ను హరివహారాదు లాపలేరు.'

తేపు నీవుండవు

'నాకు లక్ష్యము లేదు. నీచేత చావైనను నాకిష్టమే.'

'తథాస్తు !' అని యాసుందరి యతిశాంతముగాఁ బ్రత్యుత్తరమిచ్చెను. ఆకంఠస్వరంబు గొప్ప బెదరింపులకంటె మిక్కిలి భయంకరముగ నుండెను. పురుషోత్తమరావు గ్రహించలేదు. కాని యాతఁడు సరకుసేయలేదు.'

'రాత్రికి సిద్ధురాలవై యుండుము.'

'నిన్ను రూపుమాపుటకా?'

'దానికైనను సరే.'

'మంచిది. స్త్రీలు అబలలుగారు సుమీ !'

'నిజమని అనుభవముచేఁ దెలిసికొంటిని.'

'వారికిఁ దోడు లేదని తలఁపకుము.'

'నీకెవ్వరు ?'

తలుపుదట్టినశబ్దమాయెను. పురుషోత్తమరావువిసుగుతోఁ దలుపు తెఱచెను. నిర్లక్ష్యము మూర్తీభవించినట్లు ఆగుర్ఖము ప్రవేశించి చుట్టువెలిగించెను.

# రెండవ ప్రకరణము

## వేఱు దూసాయలు.

పురుషోత్తమరావు [illegible] మాటాడినట్లయ్యెను. ఉన్నట్లుండి యొక్కమారుగ నది నల్లబారెనుట యతిశయోక్తి కానేరదు. అతఁడేమియు మాటాడలేదు. ఆర్మ్రుఖము తివాసీపై నాసీనుఁడై మాణిక్యము నేకదృష్టిఁగఁ జూచుచుఁ బొగవదలుచుండెను. ఆజవ్వని గూఢ పిశాచద్వయమునకు దూరముగా గదిలో నొకమూల నిలిచెను. కొంతకాలమామె ముద్దుమొగమును గమనించి, నోటినుండి చుట్టదీసి పొడిదూర్చుచు ఆర్మ్రుఖము చిఱునవ్వుతో నిట్లనెను.

'గోవిందపంతులు! చక్కనిదానిని పరినావయ్యా! మొన్న ఈపిల్లను స్టేషనుమాష్టరు ఇంటినుండి నేను, ఓంకారము ఎతుకొని వచ్చునప్పుడు సరిగా చూడలేదు. పిల్ల రత్నముసుమా!'

పురుషోత్తమరావు ప్రత్యుత్తరమీయలేదు. ఆర్మ్రుఖము నిర్లక్ష్యముగ చుట్టను పీల్చుచు మరల నిట్లనెను.

'గోవిందపంతులు మాటాడవేమి?'

'నన్నా పేరున పిలువవద్దని చెప్పలేదా?'

'నిజమే. అయిన దాసరిపల్లిలో భయములేదు.'

'ఏమో ! గోడలకు చెవులుండును.'

'మంచిది పురుషోత్తమరావ్ పైకము వచ్చినదా?'

'ఇంకను రాలేదు.'

'ఎప్పుడు వచ్చునో?'

'రెండు దినములలో తప్పక రాఁగలదు.'

'నిజముగా.'

'తప్పక.'

'పురుషోత్తమరావ్ ! నన్ను తేలి[illegible] చూడుము.'

'దేనికి ? చూచుటలేదా?'

'నాపేరేమి?'

'ఆర్ముఖము?'

'ఆర్ముఖము అనినమాటను తప్పనివాఁడని తెలియునా?'

'తెలియును'

'తెలియదా? త్వరలో తెలిసికొనగలవు.'

పురుషోత్తమరావు మాటాడక మాణిక్యమువంకఁ జూచెను. ఆమె వారి సంభాషణ నతిజాగరూకురాలై యాలకించుచుండెను. ఆర్ముఖమును, ఆసుందరిని గంభీరముగ నొకింత కాలము తిలకించి మరలఁ బురుషోత్తమరావువైపు తిరిగి యిట్లనెను.

'సామ్మి—వేయి రూపాయలు ఈఁదలఁచుకొంటివా, లేదా ? దాచక నిజము చెప్పుము.'

'ఇచ్చెదను. పైకము రానిమ్ము.'

'ప్రస్తుతము నీవద్ద పైకములేదుగా?'

'ఉన్న నెందుకీయను?'

'అది యింతయు నాకు తెలియదు. ఖరారు ప్రకారము చిల్లిగవ్వ తక్కువగాకుండ వేయిరూకలు లెక్కపెట్టుము.'

'ఎప్పుడు?'

'ఇప్పుడు.'

'ఇప్పుడు నాదగ్గర పది రూకలు కూడ లేవు.'

'పురుషోత్తమరావ్! తప్పించుకొనజూచెదవు. వీఁడు మిక్కిలి నన్నా? నీప్రాణము నాచేతిలో నున్నది.'

పురుషోత్తమరావు కనుసైగచేసెను. మాణిక్యము సమ తమున నిట్టిపనంగ మాతెని నిలువున దహించుచుండెను.

'అర్ముఖం! ఒడలు తెలిసి మాటలాడుము. విస్తారము ప్రేలిన—పిచ్చికుక్కను కాల్చివేసినట్లు కాల్చివేసెదను!'

'తుపాకి సంపాదించితివా?' అనుచు నిర్లక్ష్యముగా అర్ముఖము చుట్ట నోటినుండి తీసెను.

'అవును. సంపాదించితిని. ఉపయోగములో పెట్టించకుము.'

'పిచ్చిగోవిందంపంతులు! నేనా నీకు జంకువాఁడను! భ్రమపడకుము. వేయిరూపాయలు ప్రయోగించుము. ఆశబ్దముతో అర్ముఖము మాయమైపోవును.'

'లేనిచో?'

'లేనిచో—ఎందుకు? నావస్తువు నేను తీసికొనిపోయెదను'

'నీవస్తువేమి?'

'ఈమాణిక్యమని నీకు తెలియునా?'

పురుషోత్తమరావు ముఖము అస్తమించుచున్న సూర్య బింబపురంగును వహించెను. నేత్రములు నిప్పుకణములు గ్రక్కుచుండెను.

'ఆర్యృఖా! తుచ్ఛుడా! జాగ్రత్త!' అని యతం డొక ప్రచండమైన కేక వేసెను.

ఆర్యృఖము కించెపడనివానివలె నిర్లక్ష్యముగా పక్కున నవ్వెను.

'పంతులు! ఎవరిని బెదరించుచున్నావు? అంత కేక వేసితివేల?

'నాకంఠములో నూపిరియుండగా నీవు మాణిక్యము నంటఁజాలవు.'

'కావచ్చును.' అని ఆర్యృఖము శాంతముగా సమాధాన మిచ్చెను.

'నీవిచటనుండి పొమ్ము. లెమ్ము. నాయింటిలో నీవింక నొకక్షణ ముండవద్దు. నడువుము.'

పురుషోత్తమరావున కింత ధైర్యమున్నదిగా? ఏమి? నీప్రియమిత్రుని, నీగుట్టంతయుఁ బూసగ్రుచ్చినట్లు తెలిసిన వానిని నన్ను, విరోధిని చేసికొను సాహసుడవైతివా?'

'నీచుఁడా! నీ బెదరింపుల కీక్షణమునుండియు గోవిందం పంతులు లొంగఁడని యెఱుఁగుము.

'ఇఁక నా ప్రయత్నములు నేను చేసెదను. పర్యవసానము చెప్పఁజాలను. ముం దీ బాలికను విడిపింపవలసియున్నది. ఆమెను నాకు మర్యాదగాఁ దిరిగి యిచ్చివేయుము ?'

ఓరీ ! నీవు పోయెదవా ? గెంటుదునా ?

పంతులు ! మాటలు మిగులకుము ! తరువాత నెత్తుటి కన్నీరు గార్చెదవుసుమా ! భద్రము.

'నీవు లేచెదవా లేదా ?' అనుచు పురుషోత్తమరావు తటాలున దుస్తులలోనుండి ఆరుగుళ్ళ చేతితుపాకి (రివాల్వరు) తీసెను. క్రోధావేశముచే నాతనిశరీర మాపాదమస్తకము కంపించుచుండెను.

ఆర్యుఖము క్షణములో గ్రహించుకొని లేచి ద్వారమును సమీపించి నిలిచెను. ఆతనికన్నులు పురుషోత్తమరావు నేత్రములలోనికిఁ జూచుచున్నంత వాడిగనుండెను.

'గోవిందంపంతులు ! మన ఒడంబడిక చెల్లినది. నీకును నాకును బాకీలేదు——అనఁగా స్నేహమువిషయములో చివర మాట లడిగి నేనిదే పోవుచున్నాను.'

'తత్క్షణమే కానిమ్ము.'

'పైకము నియ్యవా ?'

'దమ్మిడీకూడ.'

'పిల్లనీయవా ?'

'జన్మలో.'

'నీతల కాచికొనుము.'

మహోగ్రహామున పురుషోత్తమరావాతనివైపు చేతిలోని తుపాకి నెత్తెను. కాని ఆదుర్ముఖుఁడు రెప్పపాటులో వెలుపలికేగెను.

---

## మూఁడవ ప్రకరణము

---

### మామిడితోఁపు

పురుషోత్తమరావు గృహమువిడిచి ఆదుర్ముఖుఁడు వెలుపలికి వచ్చునప్పటికే బాగుగాఁ గనుఁజీఁకటి పడియుండెను. దూరమున నున్న మనుష్యులు కానవచ్చుటలేదు. ఆదుర్ముఖుఁడు విసురుగా నడచి గ్రామము దక్షిణమునకుఁ బోవ నారంభించెను. అచిరకాలములో నాతఁ డూరివెలుపలికి వచ్చెను. పొలములోఁబడి నడచుచు నాతఁ డింకను బోవఁదొడగెను. కొంతసేపటి కొక మామిడితోఁపు వచ్చెను. ఆచీఁకటిలో నది నల్లగా భయము గొల్పుచుండెను. ఆదుర్ముఖుఁడు నిర్లక్ష్యముగా నాతోఁపు ప్రవేశించెను.

అప్పటి మామిడిగున్నలక్రింద నంధకారము నిదానమేర్పఱచుకొనెను. గుమ్మటములవలె నల్లని చెట్లు దృష్టి భేదింపఁ

జాలని కటికిచీఁకటి. అర్ముఖము మెల్లగా ముందునకేగుచుండెను. ఎండుటాకులు గాని, పండుటాకులు గాని యచట లేవు. దారిపై పచ్చిక పెరిగి మృదువుగా నుండెను. ఆతఁడు నిశ్శబ్దముగా నడచి తోపునడుమకుఁ జేరెను. అచట నెవ్వరికొఱకో యాతఁడు చూచెనుగాని యాపెందమములో నాతని కెవ్వరును గానరా లేదు.

'తుకాజీ !' అని యాతఁడు కేక వేసెను.

పెద్దదగ్గు ప్రత్యుత్తరముగ వచ్చెను. అది నిస్సృళించిన పిమ్మట నెవరో గొంతు సవరించుకొనఁ దొడఁగిరి.

'తుకాజీ ఎక్కడరా ?' అని అర్ముఖము మరల హెచ్చరించెను.

'హుఁ! హుఁ—ఇక్కడరా !' అని అనతిదూరము నుండి గంభీరస్వరముతో సమాధానము వచ్చెను.

అర్ముఖము గొంతుసవ్వడినిబట్టి యుపక్రమించెను. ఒక మామిడి బోదెచాటున నాతనికొక చిన్న నిప్పుకణమువంటి పదార్థము కానవచ్చెను. ఆయస్పష్టపు వెలుతురులో నొక మనుజుని వికారవదనము కొలఁదిగఁ గన్పట్టుచు మాయమగుచు నుండెను.

'తుకాజీ ! ఇచ్చటఁ జేరితివా ?' అనుచు అర్ముఖ మా పురుషుని కెదురుగఁ జీఁకటిలో నేలపై నాసీనుఁడాయెను.

'అవును. రమ్ము.'

'పత్రి యున్నదా ?'

'ఈరాత్రికి పూర్తిగా నున్నది.'

'గొట్టములో మఱికొంత వేసి ఒకగుక్క యిటుల దెమ్ము.'

తుకాజీ కొంతగంజాయి తీసి, తృటిలోఁ జీకటిలోనే గింజలేరి, నలిచి, గొట్టములో నుండెను.

'ఖుదా ఎంత దూరాలోచన గలవాడు ! ఈ జ్ఞానపత్రి సృష్టింపనిచో మనవంటి బైరాగులు గతియేమి ?' అనుచు తుకాజీ దేవునిమహిమను గొనియాడెను.

'నిజము, నిజము, దేవికై నను మంచిదని అన్ని దిగుళ్ళకు మందు నల్లమందు కూడా పర్యాలోచెను. ఈ రేఁటిసారము సేవించువారి కెఱుక.'

తుకాజీ ఆనందమునఁ దలయూచుచు నొక నిముసము కాలము దీర్ఘముగ గుక్క పట్టెను. వెంటనే అర్ధ్యాఖము పీక నందుకొని కొండచిలువ గాలిపీల్చినట్లు మఱియొక పెద్దగుక్క పట్టెను. తుకాజీ మెల్లగాఁ బొగవదలజొచ్చెను. అది ముక్కు పుటముల నుండి, ముఖపుగుహనుండి మబ్బులు మబ్బులుగ వెలుపలికి వచ్చెను. అర్ధ్యాఖము పీకను తిరిగి తుకాజీ కందించి ధూమము వివర్జించు చుండెను.'

ఉభయులు నంతట వంతులప్రకారము జ్ఞానపత్రిని సేవించుచు బొగవదలుచు నడుమ నడుమ దగ్గుచు నీక్రిందిరీతి

గంభీరముగాఁ బ్రసంగింపఁజొచ్చిరి. తుకారాము సంభాషణ నుపక్రమించెను.

'అర్యుఖం! ఇఁక గానిమ్ము. నీవు వెళ్ళినపని యేమైనది?'

'తేపు గంజాయికి పైకకూడ లేదు—రాదు'

'అఁ! దుర్మార్గుఁడు! దమ్మిడియు నీయలేదా?'

'చిల్లిగవ్వకూడ'

'నీవూరికుంటివా?'

'బెదరించితిని—భయపెట్టితిని. ఏమిలాభము?'

'గోవింజంపంతులు జంపలేదా?'

'వాఁడా! వాఁడేరుదాటి తెప్పగాల్చఁజూచుచున్నాఁడు. కాని యాతెప్ప తననుగూడ దహించు ననుసంగతి యెఱుఁగడు—ఛండాలుఁడు!

'అవును గా! వీరివీకగోసి పీల్చనా? గాడిద, యెంత మదించినాఁడు!

'పిల్ల దొరికినది—వాఁడు మనసు మరచినాడు. జ్ఞావకముచేసినను లక్ష్యపెట్టలేదురా, తుకాజీ!

'సరి, సరి ఇల్లు వచ్చుచున్నాఁడా? వీనిమచ్చ మాపెదను! అన్నయ్యా! నీవు ఆలోచనకు మొనగాఁడవు. చెప్పుము. నేను నీచేతిలోని చక్రమువలె నీకోరికప్రకారము తిరిగెదను.'

'మొదట జరిగిన సంగతి అంతయు వినుము'

'ఇంకను విశేషములున్నవిగా? చెప్పు చెప్పుము'

'నేను వేయిరూకలడిగినానని తనప్రియురాలికి ధైర్యము చూపుటకై వాఁడు చేతితుపాకి నాగుండెకు గురిపెట్టెను'

'ఊఁ! అనుచు తుకాజీ భయంకరముగా పొగ వదలఁ జొచ్చెను.

'ఎట్లో తప్పించుకొంటిని. అరే, తుకాజీ, వానిని చీల్చి వేయవలెనురా'

'తయార్! ఆత్మ్యఖము! ఎప్పుడు?—'

'ఎప్పుడు నేటిరాత్రికాక వాఁడు మరల మనకు చిక్కునా? తెల్లవారునప్పటికి గోవిందంపంతులు పైనల్!'

'నేఁటిరాత్రియా? వానిని నఱకుదమా, పొడుతమా?'

'పొడిచివేయుదము. లుచ్ఛా. సొమ్ము చాలఉన్నదిరా? ఈయవలసినదానికే మిటకరించుచున్నాఁడు అంతయు వదలించినఁగాని రోగము కుదురదు.'

'ఇంక ఆలస్యమెందుకు? బయలుదేఱుదమా?'

'బయలుదేఱుదము, కాని వానివద్దనున్న తుపాకి లాగవలెను.'

'ఆత్మ్యఖం! ఒక్కటేమాట. తలుపులు బలవంతముగఁ దెఱచి ప్రవేశింతము. వెంటనే నీవో, నేనో యిద్దరము వాని మీఁదఁబడుదము. వానికి తుపాకితీయు వ్యవధియీయవద్దు.'

'మంచిది. తుకాజీ! నీచుఱకత్తి యున్నదా?'

'ఎక్కడికి పోవుదు? కొలువులలో వేటను నఱకినట్లు నఱకుదును. వానితల మాయము చేయుదను.'

'పిల్ల నాది'

'న్యాయప్రకారము పిల్ల నీకే వచ్చును. ఆమె నాకు వద్దు.'

'సరి. ఒప్పుకొంటిని. ధనమును లెక్కచూచి పంచుకొందము.'

'దొరకిన వెంటనే'

'లెమ్ము.'

'ఒకవేళ మనము పలాయనముచేయుట సంభవించిన?'

'తిరిగి యిచ్చటనే కలిసికొందము.'

'సమ్మతము'

'వీలైనంతవఱకు పని నిశ్శబ్దముగా జరుపవలెను. రెండవ కంటికికూడఁ దెలియనీయవద్దు.'

'సరే. జాగ్రత్తగానే పొడిచెదను.'

'దానిని పోనీయఁగూడదు, తుకాజీ!'

'జన్మలో'

'ఇఁక రమ్ము. నేను దారిచూపెదను.

ఆర్ముఖమును, తుకాజీయు లేచిరి. ఇరువురు అచిరకాలములోఁ దోవవిడిచి, కటికచీఁకటిలో గోవిందపంతులు మిద్దె వైపు నడువఁజొచ్చిరి.

# నాలుగవ ప్రకరణము

## చేతి తుపాకి

మామిడితోపులో తుకాజియు నార్యుఖముఁను ప్రసంగించుచుండినవేళ పేష్వపురుషోత్తమరావు మిద్దెలోనిగదిలో జరుగుచున్న విషయములు విశదీకరింపవలసి యున్నది.

మాణిక్యము గోడమూలననే నిలిచియుండెను. పురుషోత్తమరావును వెనుకటిప్రదేశముననే నిలువఁబడియెను. కాని యిప్పుడు ఆతనిలోఁ జిన్న ఆరుగుళ్ళతుపాకి లేదు. ఆతఁడు తన చేతులను వక్షముపై మడిచి, శిరసువంచి దీర్ఘముగా యోజించుచుండెను. అట్లాతఁడు సుమారొక యరగంటకాలము నుండియుఁ జింతించుచుండెను. చోటుకదలక విగ్రహమువలె నిలిచి యాతఁడంత తీవ్రముగా నాలోచించు విషయ మేమో యని మాణిక్యము వింతచెందెను. కాని యెంత విచారించినను ఆమెకు సమాధానము తెలియరాలేదు. పురుషోత్తమరావు చేయు యోజనాఫలముసకై యామె శాంతముగా నిరీక్షించుచుండెను.

క్షణములు, నిమిషములు గడచిపోవుచుండెను. కాని యాతఁడు వంచినతల యెత్తఁడాయెను ఎట్టకేలకు మాణిక్యము నకు మహానుమానము గలిగెను. ఆతఁడు నిద్రించుటలేదు

గద! నిలుచుండితివా? అసంభవము—మఱియు నాసమయ ముననా? మఱి యింతసేపటినుండియు నీవు డాలోచించు విషయమేమి?

ఆకస్మికముగ మాణిక్యమునకు భయముద్భవించి శరీరము కంపింపసాగెను. అతిప్రయత్నముమీఁద నామె దాని నాపుకొనెను. పురుషోత్తమరా వెట్టి ఘోరకార్య మొంచుచుండెనో! నా టిరాత్రి తన మానభంగము, చావు తప్పవని ఆమె నిశ్చయించుకొనెను. కాని ఆతని జంపకుండ మాత్రము తాను చావకూడదని యామె మనసులో శపథముచేసికొనెను. ఈ ఉద్దేశముతో, దృఢనిశ్చయసూచక నేత్రములతో నామె యాతనివదనమును జెప్పవాల్పక గమనించుచుండెను.

ఎట్టకేలకు పురుషోత్తమరావు మెల్లగాఁ దలపైకెత్తి తన దృష్టి మాణిక్యము వదనముపైఁ బఱపెను. ఆమె యాతని ముఖభావముల నతిసూక్ష్మముగాఁ బరికించెను. పురుషోత్తమరావు మిక్కిలి శాంతముగా నుండెను. ఆతనిశరీరముపై నేమియు జలించుటలేదు. ఈశాంతభావము రాఁబోవు తుపానున కుపోద్ఘాతమని మాణిక్యము నిశ్చయించుకొనెను.

'మాణిక్యం!' అని పురుషోత్తమరావు మిక్కిలి నెమ్మదిగా నామెను సంబోధించెను.

కాని యువతి ప్రత్యుత్తరమీయలేదు.

'ఇది కడసారి. నాకు సమాధానము చెప్పవా?' అని

యాతఁడు మరల నామెను హెచ్చరించెను. కంఠస్వరములోఁ గ్రోధముగాని, మోహముగాని కన్పట్టుటలేదు—దీనభావము, విచారము—కాక పశ్చాత్తాపము, ఈగుణములచట మిళితమై యుండెను.

'పలుకవా?' అని యాతఁడు మూడవమాఱు ప్రతి మాలెను.

మాణిక్యము ప్రత్యుత్తరమీయ నిశ్చయించుకొనెను. ఆతనిలోతు కనుగొనుటకు ప్రసంగమే కదా సాధనము.

'బహుశా—నిజముగా నిదియే మన మొకరి నొకరు చివరసారి చూచుట, మాటలాడుట, జవాబుచెప్పవా?' అని అతఁడు నెమ్మదిగా సంకోకమూరు ప్రార్థించెను.

అయినఁ బురుషోత్తమరావు సత్యముగాఁ బశ్చాత్తాపము చెందుచుండెనా? మాణిక్యమున కాయాశ లేదు అతని నెట్లు నమ్మవచ్చును, అది యింతయుఁ బూటకము—నక్కజిత్తులు. అయిన అన్నిటికి తెగించియున్నది కాన నామె యాతనితో సంభాషించిచూడఁ దలఁచెను. క్రమక్రమముగా నాతని నడతను గమనించుచు దానినిబట్టి తాను ప్రవర్తింపనెంచెను.

'నామనవి వినవుగా?' అని అతఁడు జాలిగా నడిగెను.

'నీకేమి కావలయును?' అని మాణిక్య మెట్టకేలకుఁ బెదవులు విచ్చెను.

పురుషోత్తమరావు మిక్కిలి సంతసించి సట్లగపడెను. ఏమి కావలయునో చెప్పుదునా?'

'చెప్పుము.'

'స్త్రీప్రేమ—నీకౌఁగిలి—నీముద్దు !'

'నీజన్మలో పొందవు.'

'ఎందుచేతనో?'

పురుషోత్తమరావు ముఖముతీరు క్రమక్రమముగా మారుచుండెను. మాణిక్యము దానిని గమనించుచుండెను.

'నీకు చెల్లెళ్ళు, అప్పలు లేదా?'

'లేరు.'

'భార్య లేదా?'

'నీవు తప్ప.'

'ఛీ దుర్మార్గుఁడా ! నీకు తల్లిలేదా?'

'లేదు.'

'నీవు పశువునకుఁ బుట్టితివా?'

'చెప్పఁజాలను.'

మాణిక్యమున కసహ్యభావ మెక్కుడయ్యెను. ఆమె నాతనిఁ బ్రశ్నించుట మాని తిరస్కారము నాతని గమనించుచుండెను. పురుషోత్తమరావు కనుల కొక్కమారుగ తేజము వచ్చెను. అని మెఱయఁజొచ్చెను. మాణిక్యము దేనికైనను సిద్ధురాలై యుండెను.

'మాణిక్యం ! ఈక్షణమువరకు ఇష్టాయిష్టములు నీ చేతిలో నుంచితిని. ఇపుడు నీవు దానిని వదలుకొంటివి. కాచుకొనుము.'

'దేనికి?'

'దేనికా? చూడుము.'

అనుచు పురుషోత్తమరావు చేతి తుపాకి వెలికిదీసి కుడిచేతఁ బట్టుకొనెను. మాణిక్యము జంకలేదు.

'నిన్ను హననముచేసెదను. బాలికా భద్రము.'

'చేయుము. అది నాకిష్టము.'

'నాకోరిక దీర్పనిచో నిన్ను గుండెలలో కాల్చెదను. నీశవములు కాలితోఁ దన్నెదను. జాగ్రత్త!'

'అదియు నాకు సమ్మతమే.'

'అఱచినచో నీతల భిన్నాభిన్నము చేసెదను. తెలిసినదా?'

'దానికిని మనస్ఫూర్తిగా ఒప్పుకొందును.'

పురుషోత్తమరావు తటాలున నామెను సమీపించి, యెడమచేతితో నామెను కౌఁగిలింపఁబోయెను ప్రాణములకుఁ దెగించియున్న మాణిక్యమాతని వినురుగ నొక త్రోపుత్రోసి, మఱియొక గోడమూలకేగెను.

'నిన్ను పేల్చెదను, మాణిక్యం! కవడ్దార్! నామాట వినవా.'

'తుచ్ఛుఁడా! వదరకుము.'

ఆతఁడామెను మరలఁ సమీపించెను. ఆమె యాతని మరలఁ ద్రోసి మరలఁ దప్పించుకొనెను.

పురుషోత్తమరావు మెను మూడవసారి బాయుచుఁ దటాలున నాగెను. గది తలుపు నెవరో బలవంతముగాఁ దెఱచిరి. గడియాయూడి ఖంగుమనుచుఁ గ్రిందఁబడెను. ఇరువురును విస్మయముతోఁ జూచిరి

'రక్షింపుఁడు! రక్షింపుఁడు!' అని మాణిక్యము కెవ్వున కేకవేసెను.

ఆర్మ్ముఖమును తుకాజీయుఁ దటాలునఁ బ్రవేశించిరి.

'అడుగో! నఱకుము!' అనుచుఁ గత్తిదూసి ఆర్మ్ముఖము పురుషోత్తమరావు మీఁదికి లంఘించెను. కాని మధ్యమార్గమున నే ధామ్మనుప్రోఁతతో తుపాకి పేలెను.

'తుకాజీ! నన్ను చంపినాడురా! నఱకుము!' అనుచు ఆర్మ్ముఖము కెవ్వున నఱచి క్రిందఁ బడెను.

'గాడిదా! చావుము!' అనుచు పురుషోత్తమరావు పొగలో నదృశ్యుఁ డయ్యెను. తుకాజీ చుఱుక త్తిదూసి యాతని వెంబడించెను.

---

## ఐ ద వ ప్ర క ర ణ ము

---

### మొం డి ప్రా ణ ము

గదిలోని పొగవిచ్చెను. మాణిక్యము ప్రతిమవలె నొక మూల నిలిచియుండెను. నేలపై నెత్తురుమడుగులో ఆర్మ్ముఖము పడి గిజగిజలాడుచుండెను. అచట పురుషోత్తమరావు, తుకా

జీయు లేదు మిగిలినవేనియు నేత్రిమార్పును సహింపలేదు చేత
నములేనిగోడలు మొనకైనవి యెచ్చటివచ్చుటనేయుండెను.

మాణిక్యమునకేమిచేయుటకును దోఁచలేదు. జరిగిన విషయముల కామె స్వర్గాంతపడెను. కర్తవ్యమామె యూహించుకొనఁ జాలకాయెను. అనుమానముతోఁ గొంతకాల మట్లు నిలిచి యాతరుణి ఆర్ముఖమును సమీపించెను. అతఁడు కనులు మూసికొని విలవిలఁ దన్నుకొనుచుండెను ఆతనిస్థితి చూచినప్పుడు మాణిక్యము దేహముకంపించెను. ఆచోరుఁ డవసాన కాలమున నుండెనని యామె తలఁచి విచారించెను. పోయి వైద్యునినవనిగానఁ బిలిచిన లాభముండునేమో ? కాని యా గ్రామములో ప్రణవైద్యుఁ డెట్లు దొరకును ? దొరికినచో?— ఈ దురదృష్టవంతుఁ డిట్లు దిక్కుమాలి ప్రాణములు వదల వలసినదేనా ?

తటాలుననంగి యామె ఆర్ముఖమును దాకెను. అతఁడు వెంటనే కన్నులు విచ్చెను కొలఁదికాలము నిర్వారపాటుతో నామెనుజూచి, తెలివితెచ్చికొని యాతఁ డిట్లనెను.

'నన్ను—నన్ను—రక్షింపుము ! మాణిక్యం బ్రతికింపుము!'

'ఎట్లు ! నేనేమి చేయుదు?
పరుగెత్తి వైద్యుని—ఎవరైనను సరే—తెమ్ము!'
'ఎవరున్నారు ?'

'గ్రామములో త్వరగా విచారింపుము.'

'నేను తిరిగివచ్చుదాక?'

'దేవుడున్నాడు.'

వెంటనే మాణిక్యము తలుపులు తెఱచుకొని వెలుపలి గాఢాంధకారములోనికి జనెను. పది నిముసములు విసురుగా నడచి యామె యొక పురుషునిగాంచెను. వెంటనే ఆమె యాగి రొజుచు, అయ్యా! మునసబుగారి యిల్లెక్కడ?' అని యడిగెను.

ఆతఁడాగి యామె నెగాదిగా చూచుచు 'నీవెవరు?, అని ప్రశ్నించెను

'అయ్యా! వ్యర్థప్రసంగమునకు వేళలేదు. దయచేసి వెంటనే చెప్పుము'

'ఇంత తొందరలో నున్నావేమి?'

'ఒక మనుష్యుఁడు చనిపోవుచున్నాఁడు వైద్యునిల్లు తెలిసిన చెప్పుడు మీామేలు మఱవను.'

'నీవీ గ్రామమునకుఁ గ్రొత్తదానవు. లేనిచో నన్నెఱుఁగుదువు——'

'మీారెవ్వరు?'

'నేనే వైద్యుఁడను.'

మాణిక్యము మిక్కిలి యానందముతో, అయిన వెంటనే రండు! రండు! మనము పోవునప్పటికే కార్యము మించిపోవునేమొ? రండు? అని యాపురుషుని ప్రార్థించెను.

'అయిన ద్రోవచూపుము' అని యాతఁడు బయలు దేఱెను.

ఉభయులును చకచక నడచుచు పురుషోత్తమరావు వద్దకుఁ దీసికొనిన మిద్దెవైపుదారిఁ బట్టిరి త్రోవలో మిక్కిలి క్లుప్తముగఁ దనకును పురుషోత్తమరావు ప్రవర్తన దుర్ముఖుఁడు తుకాజీ యాతనిఁ జంపవచ్చుట జరిగి విషయము లాతనికిఁ జెప్పెను. మిక్కిలి చింతచెందుచు నాపురుషుఁ డామెను వెచ్చెర వెంబడించుచుండెను

వారాగది ప్రవేశించి చూచునప్పటి కాదుర్ముఖుఁడు స్పృహ దప్పిపడియుండెను. ఆపురుషుఁ డాతని సమీపించి, కూర్చుండి గాయము జాగ్రత్తగాఁ బరీక్షింప నారంభించెను. దీపపు వెలుతురులో మాణిక్య మాతని యాకారమును దిలకించెను. వైద్యునికి సుమారు నలుబదియేండ్లు మీఱియుండెను. పొడగరి బక్కపలచగా నుండెను. గడ్డమును మీసములును నున్నగా గొరిగించుకొనెను. శరీరమునన్న చామనచాయ మెడలో బంగారముతొడిగిన యొంటిరుద్రాక్ష యుండెను.

'గాయమపాయకరమా?' అని యామె యడిగెను.'

'కాదు— బాధకరము. ఇతఁడు జీవించును— ఇది మొండిప్రాణము.'

'వెంటనే చికిత్సచేయుఁడు. ఆలసింపవద్దు.'

'ఈతని యెడమ పక్కములో గుండెకాయకు మూడంగుళములపైన తుపాకిగుండు తగిలినది. దానిని తీయవలెను.

'చప్పునఁ దీసివేసి యాతనికి స్పృహ గలిగింపుఁడు.'

'నేను ఇంటికివెళ్ళి పరికరములు తెచ్చెదను. ఈలోపుగ నీవీతని ముఖముపై నీరుజల్లి విసరుచుండుము.'

'సరి. కాని యీతుపాకి మ్రోతకు గ్రామములోని జనులిచ్చట గుంపుకూడరుగద?'

'నీకు రహస్య మిష్టమా?'

'అవును.'

'భయములేదు. ఈమిద్దె కొలదిదూరమున నున్నది. అదియుఁగాక నీవు చెప్పినట్లది యీగదిలో జరుగుటచే వెలుపలికి మిక్కిలి విశదముగా వినఁబడియుండదు. నాకు వినరాలేదు!

'చిత్తము. మీరు సమయమునకు భగవంతునివలె తటస్థపడితిరి. మీరేపనిమీద పోవుచుంటిరో!'

'విశేషములులేవు, మామేనమామగారి యింటినుండి తిరిగి వచ్చుచుంటిని.'

'ఇఁక మీరు త్వరలో సాధనములు తేవలెను.'

'వెళ్ళి వెంటనే వచ్చెదను.'

వైద్యుఁడు నిష్క్రమించెను. మాణిక్యము ఆర్యముఖమును సమీపించి, కొంతసేపు గాయము పరిశీలించెను. అంతట నామె లేచి పోయి, కొంత నీరుదెచ్చి యాతని ముఖముపైఁ జల్లి, కుసుకజ్జతో విసరఁజొచ్చెను. కొద్దిసేపటికి ఆర్యముఖము కన్నులు విచ్చెను.

'మాణిక్యం !'

'ఏమి?'

'నేను బ్రతికియున్నానా? వైద్యుఁడు వచ్చినాఁడా?'

'వచ్చి మందుకొఱకు ఇంటికి వెళ్ళినాఁడు. నీప్రాణమునకు భయములేదు. విచారించవద్దు. మిక్కిలి ధైర్యముగా నుండుము.'

'నాది మొండిప్రాణ మనినదెవ్వరు?'

'వైద్యుఁడు.'

'నేను చావనని రూఢిగాఁ జెప్పెనా.'

'మిక్కిలి నమ్మకముగా.'

'ముమ్మాటికి.'

'ముమ్మాటికి.'

అరుముఖుని నేత్రములో కొమారుగఁ ప్రకాశించెను.

'ఈసారి నేను బ్రతికిన గోవిందం పంతులు లేఁడు. అరే! పంతులు! నీగుండెలలో నిద్రపోయెను.'

'అరుముఖం! అలసి మూర్ఛపోయెదవు. ఇప్పుడు మాటాడవద్దు.'

ఆతఁడు మరలఁ బెదవులు విచ్చక నిశ్చలముగాఁ బరుండెను. నాల్గునిముసములలోపుగ వైద్యుఁడు తిరిగివచ్చెను. మాణిక్య మాతని నాహ్వానమొనర్చి, నేను ఈరోగికి ప్రక్కగదిలో శయ్య సిద్ధము చేసెదను, అని చెప్పెను.

చేయుము. ఈలోపుగ నేను తుపాకిగుండు తొలగించి కట్టుకట్టెదను అని యాతఁడనెను

మాణిక్యము చటినుండి నిష్క్రమించి గ్రక్కునదిలో నచిరకాలములో రోగికొఱకు మృదుతల్పము పరిశుభ్రముగ నేర్ప రచెను. వైద్యుడు కట్టుకట్టి తోడనే యామెను బిలిచెను. ఇరువురును నానుకొనఁగా అయ్యాఖుడు మెల్లగా వచ్చి శయ్యపై కృతజ్ఞత తెలుపుచు శయనించెను. అంతట వైద్యుఁడామెతో నేకాంతముగ నిట్లనెను.

'అమ్మా! నీవు భోజనముచేసి యాతనికిఁ గొలఁది దూరమునఁ బరుండుము నడుమనడుమ నాతనిస్థితి నరయు చుండుము.'

'చిత్తము. మీరెప్పుడు తిరిగివచ్చెదరు?'
'రేపు ప్రొద్దున.'
'ఈరాత్రి కేమియు ఫర్వాలేదుగద?'
'లేశమును.'

'చిత్తము. మీ రీసంగతి రెండవ చెవిలో నూదవలదని మనవి.'

'అట్లే జరిగించెదను. చూచెదవు.'

వైద్యుఁడు వెడలిపోయెను. మాణిక్యము వంటచేసి కొని, భోజనమొనర్చి అయ్యాఖునకు, గొంచెముదూరమున జాపపై బరుండెను. నాఁటిరాత్రి యామెకు నిదుర రాలేదు.

తెల్లవారులును ఆర్యుఖముకలవరించుచునే యుండెను. వానిలో నెక్కువగ 'తుకాజీ', గోవిందంపంతులు', 'మొండిప్రాణము!' 'పంతులు ! నిన్ను మ్రింగెదను !' అని పలుమారు లుచ్చరింపఁ బడుచుండెను.

---

ఆఱవ ప్రకరణము

చందమామ

నాలుగు దినములు గడచెను. ఆర్యుఖమునకుఁ గొంత స్వస్థత చిక్కెను. అతఁడు శయ్యపై గోడ నానుకొని యాసీనుఁడు కాఁగలిగెను. గాయ మపాయసహితము కాకుంట చేఁ గ్రమక్రమముగా మానుచుండెను. దాసరిపల్లిలోనివారి కేరికిని ననుమానములేకుండ వైద్యుఁడు వైద్యము చేయుచుండెను. ఆ మిద్దెలో పురుషోత్తమరావు పెట్టెలో రెండునూర్ల రూకలు దొరకెను. వానిలోఁ గొంఁదిగ మాణిక్యము భిమగ్వరుని కీఁబోయెను, కాని యాతఁ డాబహుమాన మంగీకరింపలేదు. సుస్వభావముగల యాతని యనంగీకారమునకు మాణిక్యము నొచ్చుకొనలేదు.

ఈనాలుగు దినములనుండియు నామె కొక చింతకలిగెను. తానిప్పుడు స్వేచ్ఛగానున్నది. ప్రతిక్షణమును ఆపాప కూపమును విడిచిపోయి లక్ష్మీపురములోఁ దన జనకులనమక్ష

మున ప్రాలవలెనని యామె యుద్రేకము చెందుచుండెను. కాని రోగి నొంటరిగా విడిచిపోవుట కామె కిష్టములేదు. దిక్కులేక ఆతఁడు మరణించునేమో యని యామె భయపడెను. మిక్కిలి ప్రేమగల భార్యగాని, తల్లిగాని యాతనికి మాణిక్యముకంటె నెక్కువగా సపర్య సలిపియుండరు. నాలుగు దినములును ఆర్ముఖమునకు మహానందముగాఁ గడచెను. కాని మాణిక్యమునకో? నాలుగు యుగములైన నామెకంత దీర్ఘముగాఁ గన్పట్టియుండవు. పట్టణమును గృహమువిడువనెంచి, ఆర్మ్ముఖము దుస్థితిని జూచి, జాలిచెంది యాసుందరి తన యుద్యమము నతిప్రయత్నమున మానుచుండెను.

మాణిక్యమునాగతి యిట్లుండ నిఁక నార్ముఖము మన సెట్లుండెనో చూతము. సాధారణముగా జూదరులు, చోరులు, త్రాగుబోఁతులు, కఠినహృదయులు. కాని వారికిఁ బశ్చాత్తాపముగాని, ప్రేమగాని, కృతజ్ఞతగాని యొక్కమారు గాఢముగ నాటినవా రవ్వానిని త్రోసివుచ్చ నశక్తులై యామృదుగుణముల దాసులయ్యెదరు ఆర్మ్ముఖము స్థితియు నట్లే యాయెను. మాణిక్యము తనకుఁ జేయుచుండిన మహోపకారమునుజూచి తానామె యెడల జరిపిన మహాపకారమును దలఁచికొని యామె క్షమాపణ నడిగి, యాతఁడేడ్చుచు నామెధైర్యముచెప్పువరకు నామెపాదములవిడువలేదు. ఆమెవిషయములో నాతఁడు పశ్చాత్తాపముచే దహింపఁబడుచుండెను. ఆమెయు నాతని యందు మిక్కిలి జాలివహించెను.

అర్ముఖ మామెను 'చందమామా' యని పిలువఁబోవఁ గెను. ఏటికాతఁ డామెనట్లు సంబోధింప నారంభించెనో యాజన్మమునకే తెలియలేదు. ఆమె యాతని వదులలేదు ప్రేమచే బిలుచుచుండెనని యామెకు దెలియును. తన చందమామ తన యొద్దనుండి పాఱిపోవునేమో యని యార్ముఖము మిక్కిలి కనిపెట్టి యుండెను. చిన్నపిల్లలు ప్రియమగు నాటవస్తువులను సహితమంతకంటె నెక్కువ శ్రద్ధగాఁ గనిపెట్టి యుండజాలరు ప్రతినిమిషము నాతని కామెనయనము కన్పట్టుచుండవలెను. నిద్ర లేచినక్షణమే యాతనిదృష్టి యామెమోముకై వెదకును. మాణిక్యము మాఖమున కాంతిపుంజమువలె అతికించినట్లాయెను. అట్టి యాతని నామె యెట్లు విడిచిపోఁగలదు ?

మాణిక్యము కృతజ్ఞముగ కూర్చి యోజించుచుఁ జేతులలోఁ దలచేర్చి, ఆర్ముఖము శయ్యాప్రక్కనాపై నాసీనయై యుండెను. ఆర్ముఖ మోరగాఁ బరుండి యామె నేత్రములఁ జూచుచుండెను కొంతకాలమునుండి యాతఁడు మెల్లగానిట్లనెను.

'చందమామా ! ఇప్పుడు వేళయెంత ?'

'పొద్దుగ్రుంకినది—కాని నీవు నన్నేల క్రొత్త ప్రేమతోఁ బిలుచుచున్నావు?'

'రెండుకారణములకు— ఒకటి నీముఖము మచ్చలేని చందమామ; రెండు నీవు నాచీకటిమాపిన చందమామవు— కాఁబట్టి నీవు చందమామవైతివి— తెలిసినదా!'

'తెలిసినది.'

'మఱియొకసంగతి చెప్పుమనా?'

'చెప్పుము.'

'నీవు నన్ను బ్రతికించితివి— కాదా?'

'భగవంతుఁడు బ్రతికించెను.'

'కాని యిప్పుడు నేను బ్రతికితిని— నీదయవల్ల— కాదా?'

'అవు ననుకొనుము.'

'నీకు ప్రత్యుపకారము చేసెదను.'

'ఎట్లు?'

'పగ! పగ! ఒకటి నీకొఱకు, రెండు నాకొఱకు!'

'మాణిక్యము మాట్లాడలేదు.'

'చందమామా! వినుము గోవిందంపంతులు జంపితీరెదను. లేనిచో నీకూరు నేను చచ్చితీరెదను నీపగతీర్చెదను— నాబాకీ తీర్చికొనెదను!'

'విస్తారముగ మాటాడి ఆయాసపడుచుందువు! ఇంకఁ గొంచెము నమ్మకము చిక్కునఱకు నూరకుండవుగా!'

'నాది మొండిప్రాణము, నేను చావను.'

'అయిన నీవు చేయుపని మంచిదికాదు.'

'చందమామా! నాదొక మనవి. నీవీసమయమున నన్ను విడిచిపోవఁజూడకుము ఏమంటివేని నాకెవ్వరును దిక్కులేరు. నీవే నాతలివి— నాచెలెలవు— నాప్రాణమవు. నా గాయము

బాగుగా నిద్రించిన పిమ్మట నేనే నిన్ను లక్ష్మీపురములో దిగవిడిచెదను.'

మాణిక్యము మూకీభావము వహించి నిజవిశాల నేత్రములతో నాతని దేఱిపాఱఁజూచెను.

'నీవు నన్ను సందేహించకుము, చంద్రమామా! ఇప్పటికిని తెలిసికొనలేక పోతివా? ఆర్మ్మఖ మన్నమాటను తప్పువాఁడు కాఁడు.'

'గ్రహించితిని, నీవు మాటాడక పరుండినఁగాని నేనూరకుండను. శయనింపుము, నిద్రించుము.'

ఆర్మ్మఖ మామె వదనముపై సనే దృష్టినిగిడించి నిశ్శబ్దముగాఁ బరుండెను. ఆతని కనేకాలోచనలు పోవుచుండెను. తుదకాతనికి గది తిరుగునట్లు తోఁచెను. కన్నులు క్రమ క్రమముగా మూసికొనిపోయెను. అచిరకాలములో నాతఁడు గాఢ నిద్రచెందెను.

మాణిక్య మాసంగతి జాగ్రత్తగా గమనించెను. అచటి నుండి యామె నిశ్శబ్దముగలేచి మఱియొక గదిలోనికేగి యొక కలమును సిరాబుడ్డిలోనుండి వెలికిఁదీసెను. త్వరలోనే చిన్న కాగిత మొకటి సంపాదించి యామె యోజించుచు దానిమీఁద నేమో వ్రాసెను. పిమ్మటఁ గ్రింద సంతకముపెట్టి యామె రోగిగది ప్రవేశించెను. అచటనొక చిన్నబల్లపై మెల్లగానుంచి ఆర్మ్మఖము నొక్కమారు నఖశిఖపర్యంతముఁ దిలకించి కన్ని

రితో నామె యాఁగది విడిచిపోయెను. తరువాతఁ గొలఁది కాల
మునకే పురుషాకారమున నామె యామిద్దె వదలి చవితినాఁటి
వెన్నెలలోఁ దూర్పుగా నడువ నారంభించెను.

ఆమె నిష్క్రమించినఁ గొలఁదిసేపటికి కొక పురుషుఁ
డాగది ప్రవేశించెను. అతఁడు సందడిగా వచ్చుటచే నార్మ
దము మేల్కొని చూచి 'తుకాజీ' అని సంతోషముతోఁ
బలికెను.

'నేనే! నీవు జీవించియుంటివిగదా! ఖుదాకు తేపు
నాలుగు కొబ్బరికాయలు గొట్టింతును.'

'అహా! బ్రతికియే యుంటిని. గోవిందపంతులు
చిక్కినా?'

'దొంగగాఁడిద తప్పించుకొనినాఁడు.'

'అరే బద్మాష్! కూర్చుండుము. సంగతి అంతయుఁ
జెప్పుము.'

'చెప్పెదను. ఆపిల్లయేది?'

'చందమామా!'

'చందమామ యెవరు?'

'ఆమెయే మాణిక్యము'

'ఆమాణిక్య మేది?'

'ఇంటిలో లేదా?'

'నాకుఁ గన్పడలేదు.'

'ఆఁ!'

'అనుచు నార్యమఖుడు లేచి కూర్చుండెను, తుకాజీబల్లపై చీటి చూచెను.

'ఇది యేమి?'

'తుకాజీ! చదువుము, ఏమె వ్రాసినదేమో!'

తుకాజీ! చీటి నిచ్చి యిట్లు చదివెను.

'ఆర్యమఖం! నేను పోయినని దిగులుపడకుము. నీకు ప్రాణభయము లేదు. పెట్టెలో మనవారు రెండువందల రూకలు గలవు. సొమ్మేమిచేసెదవు? నీవొక దాసినో, వంటకత్తెనో ఏర్పఱచుము. నేను లక్ష్మీపురం పోవుచున్నాను.

నీచెల్లెలు,

'చందమామ.'

---

## ఏడవ ప్రకరణము

---

### జస్వంతరావు

కనకపురమునుండి మధ్యాహ్నము మూడుగంటలవేళ బయలుదేరిన ప్రయాణీకులబండి గంటలమ్రోతతో వచ్చి శాయకూరను ప్రక్కస్టేషనులో నాగెను. శాయకూరొకమాదిరి పెద్దస్టేషను. అదియుఁగాక నాఁడచట జనులు కిటకిటలాడు

చుండిరి. సుమారు ఇన్నూరు ఎకరముల నాధుఁడగు నొక రైతు కుమారుని వివాహార్థము పెండ్లి గాను తరలి ఆ బాలగోపాలము మాతుంగపురము స్టేషనున కేగుటయే దీనికిఁ గారణము. అందుచే నచట పెండ్లివారే సుమారు నూరుమందిని మించి యుండిరి.

రెండవతరగతి పెట్టెయందున గవాక్షమునొద్దఁ గూర్చుండిన యాదవుఁ డొకఁడు పెండ్లివారి తొందర—కలవరము శాంతముగా గమనించుచుండెను. స్టేషనుమాస్టరును, గార్డును వారిని పెట్టెలలోనికి త్రోయుచు సర్దుచుండిరి. ఆడవారి కేకలును, పిల్లలయల్లరియు, పురుషుల హెచ్చరికలును, వృద్ధుల యావులును, గార్డుదొరగారి చీకాకును, స్టేషనుమాస్టరుగారి ముక్కోపమును, రైల్వేసేవకుల హడావిడియు, బండితప్పువారి తొందరయు, పెట్టెల్ల మోఁతలును, సామానునడుమ బసిబిడ్డల యేడ్పులును, తల్లుల లాలనయు—పలుమాటలేల? ఆప్రదర్శనము వింతగను, దర్శనీయముగ నుండెను.

ఈ వేగిరపాటంతయు శాంతముగాఁ దిలకించుచున్న యాదవునికి సుమారు ఇరువది యేండ్లుండును. సుందరమైన తుమ్మెదఱెక్కలవంటి వెండ్రుకలు కనుబొమలు నున్నమీసములు. గడ్డము చక్కగా గొఱుగఁబడెను వదనముతీరు గంభీరముగ నుండెను. కాని యది సామాన్యముగా మందహాసము నటుఁ డావని కన్నులు నొక్కి చెప్పుచున్నట్లు తోఁచును. పూర్ణ

ముగాఁ గనఁబడని బాహువులును, వక్షము నాతఁడు మిక్కిలి బలిష్ఠుఁడని స్వల్పదర్శనము వలననే చాటుచుండెను. ఆతఁడు వెలగలదుస్తులు ధరించెను

ముఖము కొలఁదిగమాత్రము కన్పడునట్లు ముసుగు గప్పుకొనిన యొకస్త్రీ యాపెట్టెను సమీపించి లోనికి దొంగి చూచెను. పురుషుఁడు ప్రథమమున నామె రాకను గ్రహించలేదు. కాని యచిరకాలములోనే యాతఁడు మనుష్యుల జాడకట్టి యా ముసుఁగుకప్పుకొనిన స్త్రీవంక చూచెను ఆ స్త్రీ మాత్రము బండిలోఁ జూచుచునేమో యోజించుచున్నట్లగపడెను. యాతనుని కామె ముఖము కన్పట్టుటలేదు.

'ఇది రెండవతరగతి అమ్మా! దీనిలో నెక్కకూడదు. బండికదలువేళయైనది. తొందరగా నింకొకదానిలో—,

స్త్రీ తటాలున నాతనివైపు తిరిగి 'జస్వంతా' అని యానంద విస్మయాతిశయసూచకముగ పెద్ద కేక వేసెను.

'మాణిక్యం!', అనుచు నాపురుషుఁ డించుమించుగాఁ బాలిపోయినట్లు వింతచే తెల్లపోయెను. కాని మఱుక్షణములో నాతని సహజసౌందర్య మాతనికి వచ్చెను ఆతనివదనమున నానందము తాండవమాడుచుండెను.

మాణిక్యం! రమ్మా! రమ్మా, ఎన్నినాళ్ళకు! ఎన్ని యుగములకు! ముందు లోనికి రమ్మా.

ఆతఁడు తెప్పపాటులోఁ దలుపు తెరచెను. ఆజవ్వని

క్షణములో లోనికొచ్చెను. జస్వంతరావు తలుపుమూయుచుం డగనే పెద్ద మోఁతతో బండి కదలెను.

మాణిక్యము ముసుఁగుతీసి ప్రక్కనుఁ బాఱవైచెను. జస్వంతరావామెను నిమిషకాలము తెప్పపాల్పక చూచి తటాలున నామోహనాకారమును గాఢముగఁ గౌఁగిలించి ముద్దాడెను. మాణిక్యము నాతని యుద్రేకమునకు సమమగు నుద్రేకముతో నాతనికౌఁగిటిలోని కుఱికి యాతనిలాలనల స్వీకరించెను. మఱి రెండు నిమిషములు వారానందమున మునిఁగియుండిరి. వారినేత్రము లేమి సంభాషించుకొనెనో కాని, పెదవులుమాత్రము విప్పఁబడలేదు. అంతట వారిద్వరు నొకరొకరి కెదురుగ రెండు మెత్తనిసోఫాలపై నాసీనులై సంభాషణ మొదలుపెట్టిరి. వారి చూపులలోను, ప్రసంగము లోను స్వచ్ఛానురాగ మొలికిపోవుచుండెను జస్వంతరావు చిఱునవ్వుతో సంభాషణ నుపక్రమించెను.

'మాణిక్యం! నిజముగా నాకు నేఁడొకపండగనుమీా ఇంతటి మహాదృష్టమా!'

'నాకుఁగాదా? ఎంతటి స్వలాభపరాయణుఁడవు!'

'మనకనుట మఱచితినేమీ?—ఇంత తలవని తలంపా? ఈస్టేషనులోనా?—ఎనిమిది నెలలకు తరువాత—అకస్మాత్తుగ మబ్బులేని మెఱపువలెను నీవిచటికెట్లు వచ్చితివి?'

'నాకథ చాలవున్నది. ఇప్పుడది తరగదు. నెమ్మదిగాఁ జెప్పెదను. నీ వెచటికి టిక్కెట్టు?'

'లక్ష్మీపురమునకా, నీవో?'

'అక్కడికేగాక యింకెక్కడకు?'

'మేలు! అన్నిటికేమిగాని ప్రస్తుత మెక్కడనుండి రాక?'

'ఇచటికి సుమారామడదూరమున దానరిపల్లి యను గ్రామము గలదు. అచటినుండి బయలుదేరితిని.'

'ఆపల్లెలో నెవ్వరియింటిలో నుంటివి?'

'నన్నొక దుర్మార్గుఁడు చెరగొనెను. ఆకథయంతయు నిమ్మళముగాఁ దెల్పెదను. వానియొద్దలో నుంటిని.'

'వానిపేరు?'

'వాని నిజమైనపేరు దాఁచుకొని తనను పురుషోత్తమరావని పిలుచుకొనుచుండెను.'

'దుర్మార్గుఁడు! నిన్ను రాధామణమ్మయొద్దనుండి మూఁడు వేలకుఁ గొనినవాఁడు కాఁడా యతఁడు?'

మాణిక్యము మిక్కిలి వింతచెందెను.

'జస్వంతా! నీకెట్లు తెలియును?'

'ఈనడుమ విచారించితిని—అది యట్లుండనిమ్ము. వాని నిజమైన పేరేమి?'

'గోవిందపంతులు.'

'గోవిందపంతులు! గోవిందపంతులా! నిజముగానా'

'ముమ్మాటికిని—నీకింత యాశ్చర్యమేల?'

'గోవిందపంతులు! ఔరా! హంతకుఁడా! ఈమారు నిజముగా నదృష్టదేవత నన్ను కరుణించుచున్నది' పంతులు!

చిక్కితివా? నీవిఁక చిక్కినట్లే!—ఏమి చేసెదనో పరమాత్మునికెఱుక.’

మాణిక్యము తెల్లపోవఁ జొచ్చెను.

‘జస్వంతా! అదేమి? నీవు గోవిందపంతులు నెఱుఁగుదువా?’

‘ఎఱుఁగను.’

‘మఱి.’

‘నేను మాత్రము [illegible]’

‘అతఁడు నీకేమైన అపకారము చేసెనా?’

‘లేశమును.’

మాణిక్యము నిర్ఘాంతపోయెను.

‘మఱి యీయాకారమేమి?’

‘తరువాతఁ జెప్పెదను.’

‘చిత్రమే—ఆతనికిని నీకును సంబంధమెట్లు?’

‘త్వరలోఁ దెలిసికొనఁగలవు.’

‘నీ ప్రవర్తన వింతగ నున్నది. నాకేమియుఁ దెలియుట లేదు.’

‘కొంత కాలము మాత్రమే.’

‘తరువాత.’

‘తరువాత నీవు విచిత్ర. అద్భుతవిషయములు తెలిసికొందువు.’

‘ఎప్పుడు?’

'నేఁడు తెల్లవారులోపుగ.'

'నేఁడే!'

'తప్పక.'

'అంత అద్భుతములా?'

'ఒక్కటే. నీవు జన్మలో మరల నొక్కనాఁటను నన్నిటిని తెలిసికొనఁబోవు.'

'నన్ను నోరూరించుచున్నావు.'

జన్వంతరావు వంగి యామె చెక్కు ముద్దాడెను.

'పిచ్చి నా ప్రాణమా! తొందరపడకుము. నల్లనివన్నియు నీళ్ళుగావు తెల్లనివన్నియుఁ బాలుగావు.'

'అదేమి?'

'తారామందిరములో నేఁడు కొన్ని మహాద్భుతవిషయములు తెలిసికొందువు.' ఈలోపుగ—'

'ఏమి?'

కొలఁదికాలము నన్ను యోజింపనిమ్ము.'

జన్వంతరావు యోజన నారంభించెను. ద్విగుణిత విస్మయముతో నాసుందరి యాతనివదనమును జూచుచుఁ గూర్చుండెను.

బండి విసురుగాఁ బ్రయాణ మొనర్చుచుండెను.

---

[7]

# ఎనిమిదవ ప్రకరణము

## తారామందిరము

లక్ష్మీపురమునకుఁ దూర్పునఁ గొన్ని సుందరమైన మందిరములు గలవు. అవి పురమునకుఁ గొంత యెడముగా నుండెను. వానిలో జాతివారు నివసించుచుండక పోయినను నాభవనములు పురజనులచే 'దొర బంగాళాలు' అని పిలువబడుచుండెను. ఇంచుమించుగా నవన్నియు మనోహరోద్యానములనడుమనుండి రెండుగజములయెత్తు ప్రహరీగోడలచేఁ జుట్టబడియుండెను. కట్టడప్రవేశమునకు ప్రహరీగోడలోని ప్రవేశద్వారము గడచి, గులకరాతి దిమ్మెసనేలమీదుగ, పూలతొట్టులనడుమగా బోవలసియుండెను.

ఈదొరబంగాళాలో నొకటిమాత్రము మిగిలినదాని కెడముగనుండి చక్కని పూదోటచేఁ జుట్టబడియుండెను. ఆమందిరము మిక్కిలి సొగసైనది. 'తారా మందిరము' అని పెద్దపెద్ద యెఱ్ఱయక్షరములతో వ్రాయబడియున్న పేరు మిక్కిలిదూరమునకు సహితము కన్పడును. ఆకట్టడముపైన తీగెలు ప్రాకించిరి. ఆలతలు పందిరివలె నల్లుకొని వింతవింత రంగులపూలను బూసి గృహసౌందర్యమును వృద్ధిపఱచుచుండెను.

తారామందిరమునకు ముఖద్వారము పడమటగ నుండెను. ఆవైపున సాయంసమయమున పూలమొక్కలమధ్య

నున్న కొయ్యబల్లపైఁ గూర్చుండి యొక పురుషుఁడును, స్త్రీ
యును సంభాషించుచుండిరి. పురుషుని కేఁబదియేండ్లు మించిన
వయసుండెను. పొడవరి. బక్కపలుచగానుండెను. శిరోజములు
నగము నెఱసెను. మీసములుగాని, గడ్డముగాని, యాత
డుంచుకొనలేదు. ముఖవర్చస్సునుబట్టి యౌవనమున నంద
కాఁడై యుండెనని తెలిసికొనవచ్చును. ఆతనిదుస్తులు బీదవా
నివిగా నుండలేదు

ఆస్త్రీకి నలువది యేండ్లో, లేక మూడునాలుగెక్కుడో
యుండును. కురులింకను నెఱప్రారంభింపలేదు. సుందరమైన
ముఖము. ఆమె ప్రాయము మిక్కిలి యుందకత్తెగునుటకు సం
దేహములేదు. కన్నులలో శాంతతయు, వదనమున నొకవిధ
మగు పిన్నదనమును, నామెరూపమునకుఁ గ్రొత్తకళ నిచ్చుచుం
డెను. గంభీరస్వభావము కలదని, మితభాషిణి యని ముఖము
చూచినంతనే విశదమగును. ఆమె దుస్తులు కూడ బీదరాలు
వానివలె నుండలేదు.

ఏడు నెలలే పురుషు డనుచుండెను; 'రమారమి యేడు
నిండునెలలే! నాభార్యయున్న యీచింతచేఁ దప్పక మృతిచెం
దెడిది.'

'దినము లెంతలోఁ గడచునండి!' ఆస్త్రీ సమాధాన
మిచ్చుచుండెను. 'ఎన్నిమారులు తెల్లవారును? ఎన్నిమారులు
ప్రొద్దుగ్రుంకును?'

'ఏమో, లలితా! పిల్లను జూడనిది నేను నిలువలేను. మధుసూదనరావుగారితోఁ జెప్పి రొంకటి రెండు దినములలో బయలుదేఱెదను.'

'దేనికి?'

'ఇంక దేనికి—మాణిక్యమును వెదకుటకు.'

'ఈమహాలోకములో!'

'అవును.'

'బసవరాజుగారు! ఈపిచ్చి వదలుటఁడు. మీరు విచార భారమున సిట్లనుచున్నారుకాని—'

'ఏమి? నేను నిజముగా వెళ్ళెదను.'

'అయిన మీకు నిజముగా వెఱ్ఱిపట్టియున్నది.'

'లలితా!'

'సందేహమేమి? ఎంత పిచ్చిప్రయత్నము!'

'పిచ్చిప్రయత్నమా? ఏల?'

చెప్పెదను. మాణిక్యము నెత్తుకొనిపోయిన చోరులాబాలను జాగ్రత్తగా నీపురములోనే ఎచ్చటనో దాచిరనుకొందము. మీరు ప్రయత్నించి కనిపెట్టగలరా?

'సాధ్యముకావచ్చును.'

'అబ్బా! ఎట్లు?'

'పోలీసులసాయమున.'

'దుర్లభము. మీరేగృహమును వెదకుదురు?'

'ప్రతియింట—'

'మేలు! అనఁగా ప్రతివారిని చోరులుగ సంశయింతురా? ఇది గాదా వెఱ్ఱితనము! ఎవ్వరు శోధనకొప్పుకొందురు? ఎవ్వరూరకుందురు? దొంగలేనా యంతచేతగానివారు? ఎప్పటికిని పోఁగదని యెఱుఁగుఁడు'

'అవుననుమూ!'

'ఈహిందూదేశములో దీనిని మించినవెన్ని పట్టణములు లేవు? ఇవన్నియు నెట్లు వెదకుదురు? అసంభవము. అదియు గాక—'

'ఏమి? చెప్పుము.'

'ప్రియురాలిజాడ ప్రియుఁడు కనిపెట్టలేకపోయినఁ దండ్రి కనిపెట్టగలఁడా? జరుగదు.'

'అవుననుకొనుము. ఈపదు నెలలనుండియు జన్వంతరా వెట్టి సమాచారమునుఁ దేలేదు. తానును రాలేదు!'

'వచ్చును. కొలఁదిదినములలోఁ దిరిగి వచ్చుచున్న ట్లీపదుమ జన్వంతరా వొక లేఖ వ్రాయఁడా?—'

'సత్యమే కొలఁదిదినములు గడచెను. ఆతనిజాడలేదు.'

'రెండుమూడునాళ్ళు జరుగులోపుగ వచ్చుననియే తలఁపవలసియున్నది. నేఁడె రావచ్చునని నే ననుకొందును.'

'ప్రతిక్షణము నాతనికొఱ కెదురుచూచు చుంటిమి. ఏఁడీ! మధుసూదనరావుగారు చెందుచున్న దిగులునకు మేర లేదు'

'ఆశ్చర్యమేమండి? ఆయనకు భార్యలేదు, సంతానము లేదు. ఈ సుందరిపై వారిప్రేమపాటెను. కన్నకూఁతుకంటె

గారాబముగా నాతోఁ డామెను సంవత్సరమును జూచుచుండ లేదా ?'

'లేదామఱి ? లలితా ! నిజముగా మధుసూదనరావు గారి మనసు నేమనవచ్చును ? అట్టి సజ్జనుఁ డుండఁబోఁడు. మాణిక్యము మాయమగుట వారికి గొడ్డలిదెబ్బగ నుండెను. తనకన్నుల వెలుఁగు ఆ దృశ్యమైనదనుచు నాయన వాపోవు చున్నాఁడు !'

'వాస్తవముగా నామె ప్రతివారికిని కన్నులవెలుఁగే యగును. ముద్దులుమూటగట్టు ఆమెముఖమును చూచుటయే పండుగ !'

'లలితా ! అయ్యో ! నాపిల్ల బ్రతికిఉన్నదా ? ఉండిన నిన్నిదినములు లేనితిరిగిరాకయుండును! అయ్యో! ఆ—మెకు—'

'మీరట్లు పిచ్చిఁబడకుఁడు. ఆమెకుఁ బ్రాణభయము లేదు ఆమె సౌందర్యమునకై యాసుందరి నెవరో దొంగిలించిరని నాదృఢనమ్మకము.'

'పాపిష్టి సౌందర్యము! దీనివలన బిడ్డకేమి కీడువచ్చునో కదా? ఏక్షణమున నేమి వార్త వుట్టునో ! రామా !'

'ప్రహరీగోడలోని ద్వారమెవరో తెఱచి లోనికివచ్చి నట్లు సందడికలిగెను. వారిద్దరు నటు చూచిరి. జన్వంతరావును మాణిక్యమును జకచక నడచుచు నాటాతిబల్లను తేజోవంతము లైన ముఖపద్మములతో సమీపించు చుండిరి.

'నాతల్లీ!' అనుచు సంతోషాతిశయమున బాష్పములు విడుచుచుం దబాలున లేచి బసవరాజామెకెదురు వరువిడెను.

'జస్వంతరావ్! మాణిక్యం! ఆహా! మా అదృష్టము!' అనుచు లలిత ఆనందముతో లేచి యామెకు కాముకుల డాసెను.

బసవరాజు కూంతురును గాఢాశ్లేష మొనర్చెను జస్వంత రావు లలిత చేతిని గ్రహించి కన్నులకద్దుకొనెను.

'నాయనా! స్థితిగతు లెట్లున్నవి?' అని యామె రహస్యముగ జస్వంతరావు నడిగెను.

'ఇంతవఱకు నన్నియు సరిగానే ఉన్నవి.' అని జస్వంత రావు రహస్యముగానే సమాధానము చెప్పెను.

అంతట నెల్లరును మధుసూదనరావుగారి కీశుభవార్త తెలుప తారామందిరములోనికిం జనిరి.

---

## తొమ్మిదవ ప్రకరణము

---

### మధుసూదనరావు

తారామందిరముపై నొక రమణీయమగు గదియందు బసవరాజును, జస్వంతరావును, మాణిక్యమును నొక చక్కని శయ్యప్రక్క కుర్చీలపైం గూర్చుండియుండిరి. వంటలక్క

యగు లలిత వారికి గొలది దూరమున నొక బల్లపై నాసీన యాయెను. ఆశయ్యపై నొకపురుషుడు దుప్పటికప్పుకొని పరుండెను. ఆయనయే మధుసూదనరావుగారు. ఆయన ఎఱ్ఱని టోపీని తలచుట్టును ధరించి యుండుటచే పెదవులును, నాసికయు, కనులును, కనుబొమలును, నుదురొకింతయు దప్ప మిగిలిన వదనము కప్పబడియుండెను. ఆటోపీ క్రిందనుండి నయితము కొన్ని వెండ్రుకలు గడ్డముపై నిక్కబొడుచుకొనుటచే ఆయనను గడ్డము పెరిగియుండెనని యూహింప వీలగుచుండెను. మోనము లర్థనేఱవును వెలిబుచ్చుచు మధుసూదనరావునకు సుశూషొరు బసవరాజు వయనుండునని చాటుచుండెను.

అచట సంభాషణలో లలితతప్ప మిగిలినవారు భాగము తీసుకొనుచుండిరి. మధుసూదనరావు మాత్రము శయనించియే ప్రసంగించుచుండెను.

'అమ్మా! నీవృత్తాంతము మాకు మొదటినుండియుం బూసగ్రుచ్చినట్లు చెప్పుము.' అని మధుసూదనరావు మాణిక్యమును గోరెను

'అది చాలా పున్నది బాబూ!' అనుచు నామె మందహాసముతో నభ్యంతరముచెప్పెను.

'ఇచ్చట నెవరికి తొందర? అంతయు చెప్పవమ్మా!' అని బసవరాజుగారు హెచ్చరించెను.

'మొదటినుండియు నిందునా?' అని మాణిక్యము కంఠము సవరించుకొనెను.

'అవును. ఆరంభింపుము.'

'నిన్ను తారామందిరమునుండి యెత్తుకొనిపోయిన దాది నేటివఱకు జరిగిన యేనెనెలల సమాచారములు విశదముగాఁ జెప్పుము' అని జస్వంతరావనెను.

అందఱు మిక్కిలి శ్రద్ధతో నాలకించుచుండ, మధుసూదనరావువైపుఁ జూచుచు మాణిక్యము జరిగిన దట్లు చెప్పఁదొడఁగెను.

'సుమారెనిమిది నెలల క్రిందట జస్వంతరావు తారామందిరము విడచి, తన యుద్యమమేమో యేరితోడను జెప్పక యెచటికో బయలువెడలెను. తరువాతఁ బదిదినములు విశేషము లేమియు జరుగలేదు. ఒకనాఁటి సంజవేళ నేను మన పూలతోటలోఁ దిరుగుచుంటిని. ఆసమయమున గోడమీఁదుగ వచ్చి చీటియొకటి నాముందుఁ బూలమొక్కలలోఁ బడెను. నేనా సమయమున తారామందిరము వెనుక నుంటిని. నేను వింతతో వంగి యాచీటిదీసి విప్పిచూచి చదువుకొంటిని.

'మాణిక్యం! జస్వంతరావు మహాపదలో నున్నాడు. చావు తప్పదు. కాని దిగులుపడకుము. ఇంటిలోఁ జెప్పకుము. సర్వనాశనమగును. దేవునిదయచేత నీవాతని కాపాడవచ్చును. రాత్రి యొనిమిదిగంటల కిచ్చటనే యుండవలెను.'

'దన్కతు లేదా?' అని మధుసూదనరా వడిగెను.

'దుర్మార్గులు!' అనుచు జగన్నాథరావు వండ్లుకొఱికెను.'

'దన్కతులేదు. నేనా చీకటిని నమ్మితిని. అనుభవము లేమి నేను మోసపోతిని జగన్నాథరావును గాపాడవలెనను నొక్క యూహతప్ప నింకొకటి నాకుఁ దట్టలేదు. అదియుఁ గాక నాకంత భయములేను. మీతోఁ జెప్పక నేను నాఁటిరాత్రి తొమ్మిది గంటలకుఁ దోటచేరితిని—'

'పిచ్చిదానా! మాతోఁ జెప్పక యెట్టి యనర్థముల పాలయితివి?' అనుచు మధుసూదనరా వద్దువచ్చెను.

'ఇంతకు దైవానుజ్ఞ అట్లున్నది.' బసవరాజనెను. తరు వాత ?

'ఏమున్నది ? నేను చాలసేపు తోటలోఁ జీఁకటిలో నిలు వక మునుపే యెవరో తటాలున వెనుకగావచ్చి నానోరు గట్టిగా మూసిరి. క్షణములో నాకాళ్ళు, చేతులు, నోరు, కళ్ళు, గట్టిగా బంధింపఁబడెను. భయమును మించి విస్మయముతో నేనుక్రిందబడితిని. నన్ను గోడమీఁదుగ నెట్లో చేరవేసి యొక బండి నెక్కించిరి. బండిరువ్వున సాగెను. నానునస్సెట్లుండెనో పలుమాటలలో నేను వర్ణించుటకంటె మీరూహించుకొన వచ్చును. జరిగిన మోసమునకు కోపముతో, భయముతో నా తెలివి లేమికిఁ బశ్చాత్తాపముతో, రోషముతో ప్రతీకార భావముతో నేను పిచ్చియూహల నెన్నియో దారిపొడుగునను

చేయుచునే ఉంటిని. ఎట్టకేలకు బండి ఆగెను. నన్ను దించిరి నానోటిగుడ్డలు విప్పి నాకు భోజనము పెట్టబోయిరి. కాని నేను ముట్టలేదు. నన్ను పరుండఁబెట్టిరి ఎచ్చటో? నాకుఁ దెలియదు తెల్లవారినతరువాత నానోటికి గుడ్డలుకట్టి మరలఁ బండిలోఁ బ్రయాణమారంభించిరి. రాత్రి నిద్రలేమిచే నచిరకాలములోనే గాఢముగ నిద్రించితిని.

మాణిక్య మొకింతయాగి మరల ప్రారంభించెను.

'ఏదిమాటలేల? భోజనము వేళ కాఁగుచు, మరల బయలుదేఱుచు, మేము మూఁడు దినములు ప్రయాణముచేసితిమి. ఈలోపుగ నాబంధములు వారువిప్పలేదు. భోజన సమయమునకు నోటిగుడ్డలు మాత్రము విప్పుచు వచ్చిరి. ప్రయాణ మెప్పుడు ముగియునాయని వింతగనుండెను. భయముమాత్రము నాకుఁ గలుగలేదు. వారు నన్ను చంపరని నాకు ధైర్యము బాగుగాఁ గలిగెను. ఎందుకట్లు కలిగెనో నాకు దెలియదు.

'మూఁడు దినములకుఁ బిమ్మట మాబండి యాగెను. నన్ను దింపిరి. ఎవరో సాయముచేయఁగా నేనొకగృహము ప్రవేశించి కొన్ని మెట్లెక్కఁదొడఁగితిని. నేనొకగది ప్రవేశించినట్లు తెలిసికొంటిని. అచట నాబంధము లన్నియు విప్పఁబడెను. మూఁడుదినములకుఁ దరువాత నేను కండ్లు తెరచి చూచితిని. అదియొక విశాల మగుగది. ఒకటే తలుపు ఉన్న రెండు చిన్న కిటికీలును మిక్కిలి యెత్తుగానుండెను. గదిలో శయ్యయు,

సోఫాలు నుండెను. నేనచట నారు నెలలుంటిని—ఆరు నెలలు! అక్కడకు నన్ను తీసికొనివచ్చినది ఓంకార మనువాఁడు. ఆయిల్లు రాధాయమ్మయను స్త్రీది! వారు భార్యాభర్తలు, వారికి శ్రీముఖి యను కూఁతురు గలదు ఏటికి నన్నిచటికిఁ దీసికొనివచ్చిరో తెలియకుండఁ ఖైదీగా నిమ్మత్రాణము గుఱించి పెద్దదిగులుతో, నేనచట ఆరు నెలలు గడపితిని. శ్రీముఖినాతో నప్పుడప్పుడు సంభాషించుచున్నను, నన్ను తన తల్లిదండ్రులు ఏమిచేయనెంచిరో మాత్రము చెప్పినదికాదు.

ఇచ్చట మాణిక్యము వృత్తాంతము వదలివేయుచున్నాము—అనగా నామెవాక్యములుగాఁ జెప్పుటయని మా అభిప్రాయము. మాణిక్యము తరువాత పురుషోత్తమరావు రాక దగ్గఱనుండి తిరిగి పురుషోత్తమరావునొద్దనుండి దాసరిపల్లిలో తప్పించుకొనువఱకు జరిగినవృత్తాంతము చదువరులకుఁ దెలిసినదగుట దానిని ఆమె వారికిఁ జెప్పినట్లుగానే తెలుపుచు దానిని విడుచుచున్నాము. మాణిక్యము పురుషోత్తమరావు నిజమైనపేరు గోవిందపంతులు అని మాత్రము చెప్పలేదు. కారణము జన్వాంతరావు కోరికయే. చలితివాఁటి వెన్నెలలో, దాసరిపల్లిలోని మిద్దెవిడిచి, యామె ఆర్యముఖమును మోసపుచ్చి, పురుషవేషము ధరించి, తూర్పుగా నడువ నారంభించెనని వెనుక చెప్పితిమి. ఆమె వృత్తాంతమచటినుండి తిరిగి యెత్తుకొనుచున్నారము.

గద్దపురములో రాధాయమ్మగృహము—ఓంకారము, శ్రీముఖి, జ్వాలల వర్ణన—పురుషోత్తమరావు రాక—మోసపు మాటలు—తా నాతని వెంబడించుట—రైలులో జరిగిన సంగతి—తాను కనకపుర స్టేషను మాష్టరుగారియింట నాఁటి రాత్రి బస చేయుట—చోరుల మోసము—ఆర్యముఖము తనను దాసరిపల్లెఁ జేర్చుట—అచ్చట పురుషోత్తమరా వొక మిద్దె నేర్పరచియుంచుట—ఆమిద్దెలో జరిగినవిశేషములు—పురుషోత్తమరావు పలాయనము—తా నార్యముఖమునకు సపర్య చేయుట—క్రిందటిరాత్రి యాతని విడిచి పురుష వేషముతోఁ జీకటిలో బయలుదేరుట—ఈ విషయము లన్నియు సవిస్తరముగాఁ దెలియఁజెప్పి మాణిక్య మిట్లనెను.

'ఆర్యముఖమును విడిచి నే నాఁకనుచీకటిలో బయలుదేఱితిని. నిన్న చవితికదా? ఆకొంచెపు వెన్నెలలో నేను దైవవశమునఁ గనకపురము బాటను కనిపెట్టితిని. నాకప్పటికి నిశ్చయముగా నది కనకపురమార్గమని తెలియదు గాని నే నట్లూహించితిని. తుదకు నేనూహించినట్లే తేలెను. కొంతదూరము నడచితిని. అచట గంటలమ్రోఁత వినరాఁగా నడక హెచ్చించితిని. అచిరకాలములో నాకుఁ గొన్ని సవారిబండ్లు గన్పట్టెను. అవి యిరువదిని మించుచుండెను. బండ్లలో స్త్రీ కంఠస్వరమునఁ బ్రసంగము స్పష్టముగా వినవచ్చుచుండెను. నేను ఆత్రముగా వెనుక నున్న బండిని జేరితిని.

'ఎవరు వారు?' అని స్త్రీ గద్దించి అడిగెను.

'అమ్మా! మిక్కిలి కష్టములోనున్న స్త్రీని—రక్షింపుదువు?' అని నేను దీనముగాఁ బ్రార్థించుచుఁ బురుషవేషమును దొలగించితిని.

'స్త్రీలేమో గుసగుసలాడిరి. నేను బళ్ళవెంబడి వచ్చుచుంటిని. తటాలున బళ్ళన్నియు నాగెను. కొందఱు పురుషులు దీపములతో నన్ను జుట్టుముట్టిరి. వారియాజ్ఞ ననుసరించి నా వృత్తాంతము మిక్కిలి క్లుప్తముగా వారికిఁ దెలియఁబఱచితిని. వారు నాయిష్ట మడిగిరి.

'మీరెక్కడికి పోవుట?' అని నేను ప్రశ్నించితిని.

'మేము పెళ్ళివారము. తరలి పోవుచున్నాము. శాయకూరు స్టేషను జేరుదుము' అని సమాధానము వచ్చెను.

'నన్ను కూడ మీబళ్ళలో శాయకూరుస్టేషను జేర్చుడు. మీమేలు జన్మలో మఱవను!' అని ప్రార్థించితిని.

'వారంగీకరించిరి. నేనొక స్త్రీలబండిలోనెక్కి వారితోఁబాటు ప్రయాణముచేసి, తెల్లవారుజామున శాయకూరు జేరితిని. పెళ్ళివారును లక్ష్మీపురమువైపుగా వచ్చుచుండుటచేతను మధ్యాహ్నము పోవునట్లు చెప్పుటచేతను, వారి కోరికమీఁద నేను వారియొద్దనే యుండి, నేఁటిమధ్యాహ్నము స్టేషను జేరి, కొలఁదిగఁ బైకమున్నది కావున రెండవతరగతి టిక్కెట్టు కొని, పెట్టెకొఱకు వెదకుచుండ, నదృష్టవశమున జన్మాంతరావును

జూచుట సంభవించెను. నీకు సంక్షిప్తముగా నాయీ యేడు నెలలచరిత్ర వినిపించితిని. ఇంక జన్వంతరావు తన వృత్తాంతము చెప్పవలసి యున్నది.'

మాణిక్యముయొక్క వృత్తాంతము ముగిసెను. లేనిపోని వర్ణనలతోఁ గాలము వ్యర్థము చేయక కథాసందర్భమునకు తగినట్లుగా, క్లుప్తముగా ముగించుట జూచి దేశ్పాండే యున్నారము. తరువాత జన్వంతరావును తనవృత్తాంతము చెప్పుమనిరి తాను, పలుమారు గడిచినను నాతఁడు చిఱునవ్వుతోఁ దనకుఁ జెప్పుటకు విశేషములు లేవనియు, మాణిక్యము జాడ కనిపెట్టుట దుర్లభ మాయెననియుఁ జెప్పి యూరకుండెను.

'ఈపురుషోత్తమరా వెవఁడు?' మధుసూదనరా వనెను. వీరికిని గర్తపురములోని ఓంకారమునకును సంబంధమేమి? వీరొకరినొక రెఱుగుదురు? చిత్రముగా నున్నది!'

'ఈరాధాయమ్మను, సహచరులను దొరతనమువారికి బట్టించితిమా?' అని బసవరాజనెను.

ఇట్లే యరగంటకాలము ప్రసంగములోఁ బుచ్చినమీఁదట నందరు భోజనములకు లేచిపోయిరి. మధుసూదనరావుగారుమాత్ర మట్లే యుండి మాణిక్యమును బిలిచెను. ఆమె యాగెను.

'ఎందుకు బాబూ!'

'భోజనము చేసిరావమ్మా! నీముద్దుమాటలు వినక చెవులు వూడిపోయినట్లున్నవి.'

'తప్పక వత్తును.'

'పోయి రమ్ము'

మధుసూదనరావుగా రొక్క ముద్దిచ్చి మాణిక్యము క్రింది కేగెను. ఆతడుమాత్రమచ్చట శయనించి యోచించుచుండెను. గడియారము టంగుటంగుమని పదునొకండు గంటలు కొట్టెను.

---

## పదియవ ప్రకరణము

---

### ఆలోచన.

భోజనానంతరము మాణిక్యము తన గది కేగి, నిలువుటద్దముముందు నిలిచి చకచక శిరోజములు వదలుజడ చేయుచుండెను. అది త్వరలో ముగించి యామె వెనుదిరుగునప్పటికి సరిగా జస్వంతరా వాగది ప్రవేశించెను. చిఱునవ్వుతో మాణిక్యమాతని సమీపించెను.

'ఎక్కడికి మాణిక్యం?' అని యాతఁడు మృదువుగాఁ బ్రశ్నించెను.

'బాబుదగ్గఱకు.'

'తిరిగి తొందరగా వత్తువా?'

'పావుగంటలో—'

'మాటలసందర్భమునఁ—జాలసే పుండవచ్చును.'

'అయిన ?'

'త్వరగా రావలెనని నాకోరిక.'

'జస్వంతా ! నీనడత యెప్పుడును వింతయే ? దేనికి ?'

'తెలిసికొనఁగలవు. మఱియొక ప్రార్థన'

'అదేమి ?'

'నీవు పురుషోత్తమరావు నిజమైన పేరుచెప్పక నాకు సాయ మొనఁచితివి. మీబాబుతో ఇప్పుడును చెప్పవద్దు.'

'చెప్పను.'

'మఱి నిజముగా పావుగంటలో రమ్ము—ఏదోవంకపై.'

'ఎచ్చటికి ?'

'మీనాయన గదికి.'

'సరి.'

మాణిక్య మచటినుండి మేడపై కేగెను. జస్వంతరావు బసవరాజుగదిలోని కరిగెను. బసవరా జచట నాకొఱకై నిరీక్షించుచుండెను. జస్వంతరా వాసీనుఁడై యిట్లనెను.

'ఏమియు జాడలేదుగదా ?'

మాణిక్యముతల్లి జాడయా ?'

'అవును.'

లేశమును తెలియరాలేదు. మీఁదుమిక్కిలి యీనడుమ మాణిక్యము విచారములో నానంగతిని గూర్చి ప్రయత్నించలేదు.

జస్వంతరావు కొంచెముగ యోచించి యిట్లనెను.

'మాణిక్యము జననవిషయమున మీభార్య ఆస్త్రీదగ్గర నుండుటచేతను, తరువాత బదిదినములుపచారము చేయుట చేతను, ఆమె యాస్త్రీని గుర్తింపఁజాలెడిది కాని మనదుర దృష్టమువలన మీభార్య గతించినది. కాబట్టి ఆస్త్రీజాడ కని పెట్టుట కష్టసాధ్యమే.'

'అయినను ప్రయత్నించుదము.'

'అందులో లోపమేమి ?'

'మఱి ఈరాత్రి నీవు మాటాడఁదలచిన విషయమేమి ?'

'మాణిక్యము విషయమే.'

'ఏమిటి ?'

'ఆమెకు యుక్తవయసు వచ్చినది. కష్టసుఖములు గ్రహించుజ్ఞానము వచ్చినది కాదా ?'

'అవును.'

'అయిన నిఁక దాచవలదు. మీరు నిజముగా నామె తండ్రి కారని, ఆమె జననరహస్య మామె కెఱిఁగించు సమయము వచ్చినదని యామెతోఁ జెప్పుడు. నేఁటిరాత్రి యామెకు సమస్తమును దెలుపవలెను.'

'నేఁటిరాత్రియే.'

'అవును. ఆమె మధుసూదనరావుగారి యొద్దనుండి

తిరిగివచ్చిన వెంటనే తన విషయము నామె సంపూర్ణముగాఁ దెలిసికొనవలయును.'

'నే నామెజనకుఁడనని కాదని తెలిసికొని యామె నన్ను పూర్వమంతగా ప్రేమించదేమో ?'

'మీ వెఱ్ఱి. ప్రేమ ఆమె కెప్పటికిని తగ్గదు.'

తరువాతఁ గొంతకాలము వారు రహస్యముగాఁ గొన్ని విషయములు చర్చించుకొనఁ జొచ్చిరి. అంతలో వారికెవరో మేడమెట్లు దిగుచున్న చప్పుడు వినవచ్చెను. జన్వంతరా విట్లనెను.

'మఱువకుఁడు. సంపూర్ణముగాఁ దెలియఁజెప్పుడు.'

'తప్పక'

'తొందరపడక యుక్తియుక్తముగా ఎఱిఁగింపుఁడు.'

'అట్లే.'

'ఆమె వచ్చుచున్నది. నేను అరగంటలో మరలఁ దిరిగివచ్చెదను.'

'ఇచటికే.'

జన్వంతరావు లేచి నిష్క్రమించెను మఱి రెండు నిమిషములకు మాణిక్యమాగది ప్రవేశించెను.

## పదునొకండవ ప్రకరణము

### లలిత

బసవరాజుండిన గదినుండి బయలువెడలిన ధన్వంతరావు తిన్నగా వంటయింటి దారిఁబట్టెను. అత డచట జేరునప్పటికి లలిత సామగ్రిసర్దుచుండెను. ధన్వంతరావు రాకచూచి యామె తనపని త్వరలోఁ గావించెను. పిమ్మట నామె యాతని సమీపించి ప్రేమతో గాఢాలింగనమొనర్చి, బాష్పములతో ముఖము ముద్దాడెను. ధన్వంతరా వామెను మృదువుగ నొకబల్లపై గూర్చుండఁబెట్టి తా నామె సరస నాసీనుఁ డాయెను. లలిత ప్రసంగ మిట్లారంభించెను.

'నాయనా! ఇట్లెంతకాలము గడుపుదుము? ఏసంగతియు తేలదాయెను. ఆయిరువురిలో నొకనిజాడయైనఁ జిక్కెనా?'

'ఒకనిదేమి? ఇద్దరిసంగతి తేలెను. మిక్కిలి తలపని తలంపుగ.'

'ఏమి! సుమారు పదునాఱేండ్లక్రిందట పలాయనము చేసిన గోవిందపంతులును, ప్రస్తుత మెచ్చట నున్నవారో నీకు దెలియునా?'

'తెలిసినట్లే.'

'ఎవరిమూలమున?'

'మాణిక్యమువలన.'

మాణిక్యమువలననా ! మఱింత చిత్రముగా నున్నది ఎట్లు ?

'విశేషములు తరువాతఁ జెప్పెదను. ప్రస్తుతవిషయ మేమన పురుషోత్తమరావనే గోవిందంపంతులు— ఆర్యశిఖ మాతని సేవకుఁడు.'

'ఛండాలుఁడు !'

'అవును. మాణిక్యమును వేఁటయాలివృత్తికిఁ ద్రిప్పఁ జూచిన పురుషోత్తమరావు నిజముగా మనవగవారిలో నొకడు'

లలిత యొకింతకాలము సావధానముగ నాలోచింపఁ జొచ్చెను. జస్వంతరావట్లు శాంతముగా నాసీనుఁడై యుండెను. ఎట్టకేల కామె యిట్లనెను.

'పురుషోత్తమరావు ఆర్యశిఖమునుగాల్చి పలాయనము చేసినట్లు మాణిక్యము చెప్పలేదా ? మఱి అతనిపోక కనిపట్ట వలయును.'

'నేను ఱేపువెళ్ళి తగుప్రయత్నములు చేయుదును.'

'తిరిగి రాక ?'

'మిక్కిలి తొందరగా— మధుసూదనరావు విషయ మేమి ? మనయనుమానము నిజమా ?'

'తప్పక కావచ్చును.'

జస్వంతరావు వదన మాశచే వికసించెను.

'ఎట్లమ్మా?'

'ఈసంవత్సరముప్పటి నుండియు నాకుఁ దెలిసినంతవఱ కాయన నెత్తిమీఁద యూలుటోపీ మాయెదుట తీయలేదు.'

'స్నానము నిత్యము గదిలోఁ జేయుచుఁ దలుపులు బంధించునుగదా?'

'అవును. ఎప్పటివలెనే.'

'ఇది యొక పెద్దకారణము కావచ్చును—కాకుండ వచ్చును. అయినను నేను తేపాతటి సూక్ష్మపరీక్ష చేయఁదలచితిని'

'ఏవిధముగ?'

'నా ప్రస్తుతపు ఉద్యోగము తప్పు మిగిలిన విషయము లాతనికిఁ జెప్పి యాతని సమక్షమున గోవిందంపంతులు పేరును దానిమూలమున 'కన్నపుదొంగ' లోని కొన్ని విషయములును దెత్తును. మధుసూదనరావు ముఖముప్పుడు పరీక్షింప వలసి యున్నది.'

'అవును. మంచి యుపాయమే.'

మధుసూదనరావు నిజముగా మనమనుకొను పురుషుఁడైన తప్పక బయలుపడును.

'తప్పక.'

'అది యట్లుండనిమ్ము తేపు మాణిక్యము హస్తగతమైన మదిగెదను. అప్పుడు మనసంగతి వచ్చును. నీవు నాతల్లివని—మొదలైన విషయములు అందఱికిని తెలిపెదను. ఇఁక దాపరికము అవసరములేదు.'

'నీ నిజమయిన పేరును, ప్రస్తుతప్రవృత్తియుఁ జెప్పెదువా?'

'చెప్పెదను. కాని నేఁటిరాత్రి మాణిక్యమునకు మాత్రము ఆపంగితులు, మన బాంధవ్యము చెప్పవలసి యున్నది. ఆమె యిష్టాయిష్టములు కనఁగొనవలెను. నేనే పగటిచుక్కనని చెప్పి నప్పు డామె యేమి గ్రహించునో, లేదో చూడవలసి యున్నది.'

'మంచిది చంద్రము, శ్రీధరు డెచ్చట నున్నట్లు?'

'గత దినములలోనే విశేషముతోనైన నున్న రామరాజు త్తరము వ్రాయును. నాకు డైరీయొక్క తరువాత మాణిక్యము తల్లిదండ్రులఁ బరామర్శ చేయవలసి యున్నది.'

'ఆమె జన్మవృత్తాంత మామెకుఁ దెలియఁబఱచుఁడు.'

ప్రస్తుతము జనకరాజు ఆపని చేయుచున్నాఁడు.

'నాయనా! ఇఁక నీవు సంసారము నన్ను విడిచియుండిన నేను నిలువలేను. పగటిచుక్క ప్రాణములు నిల్పితిని. 'కన్నవు దొంగ' వ్రాసిన వెంకటరావుగారు నా పగ కొంత తీర్చిరి— మిగిలినది నాకన్నుల వెలుఁగును నీవు తీర్చవలెను. నాకదే కోరిక.'

జన్మాంతరావు విచారముతోఁ దలయూచి తల్లిని లాలించుచు నిట్లనెను.

'అమ్మా! ఒక బుద్ధుచూడవైతివి. నిజముగా మధుసూదనరావు మన మనుకొనినట్లు నతారాయైన?—'

'పైన భగవంతుఁడున్నాఁడు!', అని లలిత తలయూచుచు సమాధాన మిచ్చెను.

'మనమాలసనైన నెట్లు పగదీర్చుకొనఁగలము?'

'అసంభవము.'

'కావున, గొప్ప చిక్కులెన్నైనను గలవు. వానినిగూర్చి పిమ్మట యోజింప వలసియున్నది. ప్రస్తుతము పోయివచ్చెదను.'

'ఎప్పటికి?'

'మాణిక్యమును జూచుటకు — మరలఁ గొంతకాలమునకుఁ దిరిగి వత్తును. నీ విచ్చటనే యుందువా?'

'అవును.'

జస్వంతరావు తల్లినిఁ గౌఁగిలించి గదినుండి నిష్క్రమించెను. లలిత దీర్ఘాలోచన నారంభించెను.

---

## పండ్రెండవ ప్రకరణము

---

### వెనుకటి సంగతి

మాణిక్యము గదిప్రవేశించునప్పటికి బసవరాజుచేతిలో నొక మడిచిన కాగితముపట్టుకొని యామెకొఱకు నిరీక్షించుచుండెను. ఆమె వచ్చినతోడనే యాననముచూపి బసవరాజు గంభీరముగా నిట్లనెను.

'అమ్మా! నేఁటిరాత్రి నీకొక వింత సంగతి తెలుపఁబోవుచున్నాను. నీవు సంసిద్ధురాలవై యుండుము.'

'దానినైజ మెట్టిది?' అని మాణిక్యము విస్మయముతో నడిగెను

'నీకు కొంకెక్కలి సంబంధించినది—చెప్పుమునా?'

'చెప్పుడు.'

'నేనును, నాభార్యయు నీ కేమగుదుము?'

'మీరు నాతలిదండ్రులు!' అని యామె మతింత విస్మయముతో ననెను

'కాదని యీకాగితమునుండి తెలిసికొనుము.'

మాణిక్యము తన చెవులను నమ్మజాలకపోయెను

'నాయనా! ఇదేమి విపరీతము! నీవు నాకన్నతండ్రివి గావా? రమణమ్మ నాకన్నతల్లి కాదా?'

'ముమ్మాటికిని గాదు—కాదు. అయినను నీయందుం బుత్రికావాత్సల్యము నాకు రేణువైనను తగ్గలేదని యెఱుంగుము.

'ఇదెట్లు? ఇన్నినాళ్ళీవిషయము దాచితిరేల? నానిజమైన తల్లిదండ్రులెవ్వరు? మీరేల నన్ను మాయగా పెంచితిరి?'

'నీతల్లిదండ్రులెవ్వరో దేవునకెఱుక—కొన్ని కారణములచే నిన్నింత మాయగా పెంచితిమి'

'ఇంకను దాపరికమెందులకు?—అన్నియు విశదముగాం జెప్పుడు.'

'ఈకాగితము చూచుకొనుము—నీకన్నియు విశదమగును.'

'ఆత్రముగా మాణిక్యమా కాగితమునందుకొని దానిని మడతవిప్పనారంభించెను. బసవరాజా మెచర్యఁ జూచుచు నిట్లనెను.

'మొదటి నీకందలి సంగతులు అర్థముగాకపోవచ్చును. కావున స్వల్పముగఁ జెప్పవలసియున్నది ఈకాగిత మొకస్త్రీ పుస్తకములోనిది—వ్రాతయు నామెదియే. దీనినామె పుస్తకమునుండి చించి మాయింటిలో బల్లపైఁబెట్టి బాలెంతరాలై నను లక్ష్యపెట్టక తొమ్మిది దినములబిడ్డను నిన్నువిడిచి చిత్రముగా నంతర్ధాన మొందెను. నాఁటినుండి నేఁటివఱ కామె జాడ లేదు!'

మాణిక్యముజన్మ ఆమెకన్నులయొగుటనే ప్రచండమైన మార్పును చెందుచున్నట్లుండెను.

ఈసంగతులు జరిగి యెంతకాలమైనది?' అని యామె గంభీరముగా నడిగెను.

'సుమారు పదునాఱు సంవత్సరములని నేను వేఱ చెప్పవలెనా? నీవయసును బట్టి తెలిసికొనలేవా?'

'ఔను—నాబుద్ధి తారుమారైనది. పదునాఱేండ్లు మాయమ్మ జాడలేదుగా!'

'లేశమును—ఆకాగితమిప్పుడు చదువుము. సంగతులు విశదమగును.

వణఁకుచున్నహస్తములతో మాణిక్యము కాగితము చదువఁ దొడఁగెను. అందీ క్రిందివిధముగ వ్రాయఁబడి

యుండెను—ముత్యములవంటి యక్షరములు—దస్తూరి యొక స్త్రీది.

'దైవమా! నాయపరాధముల క్షమించుము నేను నీయెడ— నాయెడల— అనేకులయెడల మిక్కిలి ద్రోహ మొనర్చితిని— నేనొక స్త్రీనిగదా!

* * *

నే నేమిచేయను?— పాపసొమ్ము— పాపిష్టిదనము! దానికి లొంగితిని— లొంగనివారెవరు? పురుషుడును చక్కని వాడే మిక్కిలి ధనికుడు నావృత్తి యాతడెట్లు కనిపెట్టెనో? అతని కోరికకు నేనంగీకరించితిని. కాలము కులాసాగా గడచినది— పదునేను రాత్రులు— అయిదువందల రూకలు?

* * *

'ఈ ఆరునెలల నుండియు వానిజాడలేదు. పెద్ద ఆశపెట్టి ఆపురుషు డెక్కడ కేగెను? ప్రస్తుతము కొంతకాలము ఇబ్బంది లేదు. కాని నెలయూలును—నాకీగర్భమేమి?—కానిమ్ము.... ఎట్లు కానున్నదో!

'తలవని తలంపుగ వామనరావుతో పరిచయము— బీదవాడు— పిల్లలులేరు— భార్య, తానుమాత్రమే!— ఆలోచించనిమ్ము నాకాన్పు ఆయన పాతను వేయునా? ఆయన ఒప్పుకొనునా? ఒప్పుకొననిచో నా నగలులేవా?— పాపిష్టి నగలు? ఆయనను గడ్డితినిపించనా?'

మాణిక్యమాగెను. కాగితమొక వైపునున్న పంక్తులై పోయెను. అవి యామెకు పూర్ణముగా నర్థముకాలేదు—

పూర్ణముగా నర్థముకాకుండను లేదు. వింతతో నామె బసవ
రాజువైపు తిరిగెను.

'వామనరా వెవరు?' అని యామె యడిగెను.

'రెండువైపులఁ జదివితివా!'

'లేదు ఒకవైపుమాత్రమే.'

'అయినఁ బూర్తిగాఁ జదువుము— తరువాత మాటా
డుదము.'

'అప్పుడు నా సంశయములు తీర్చెదరా?'

'తప్పక.'

మాణిక్యము కాగితము త్రిప్పెను. అటువైపున దస్తూరి
కొంచెము వణఁకుచున్నట్లు వ్రాయఁబడెను. కాని వెనుక
వ్రాసిన స్త్రీయే దానిని కూడ వ్రాసెనని చూచిన వెంటనే
కనఁగొనవచ్చును. అదియొక లేఖారూపకముగ నుండెను. ఉద్రేక
ముతో మాణిక్య మిట్లు చదివెను.

'వామనరావుగారు, కుసుమమ్మగారు నాయీ మహా
పరాధమును మనస్ఫూర్తిగా క్షమించి, దిక్కులేని యీపసిబిడ్డను
గాపాడుదురుగాక!'

'నేను దోషపూర్వకముగా గర్భము ధరించితిని. నాప్రి
యుఁడెవ్వఁడో నాకే తెలియదు. అతఁడు మాయమయ్యెను.
నేను నంతర్థాన మగుచున్నాను. ఈబిడ్డకుఁ దల్లియుఁ దండ్రియు
మీరే నాకున్న నగలలో నున్నా రాఱునూర్ల రూకలఖరీదుగ

లవి ఇచ్చుటఁ బెట్టినాను పిల్ల కేలోటును లేకుండఁ గాపాడుడు ఇదియే నాకడసారి ప్రార్థన. మిమ్ము మఱిమఱియు బ్రతిమాలుచు.

'ఆ.'

'అలం తాజ'

'నాపోక కనిపెట్టుటకు పిచ్చిప్రయత్నములు చేయకుడు నేను మీకు మరల జన్మలోఁ గనఁబడను పసిబిడ్డను ధన మాశచేఁ జంపవద్దు.'

కాగితమును జదువుట ముగిసెను. మాణిక్యము కొంత కాలము యోజించెను. అంతట నామె కాగితమును భద్రముగా మడిచి బసవరాజుతో నిట్లనెను.

'తండ్రీ! నేనీకాగితమును జన్మాంతము నాదగ్గఱ నుంచు కొనెదను. ఇఁక నీజన్మలో నాకన్నతల్లిని జూచుట అసంభవము ఈక్షణమునుండు నుకఁ గన్నతల్లిదండ్రుల మఱపించిన మీభార్యా భర్తల కిపుడును, ఎప్పుడును గృతజ్ఞురాలను. విధేయురాలను.'

'అమ్మా! నేను మిక్కిలి ప్రయత్నించి 'అ' యను మొదటి యక్షరపుపేరుగల యా స్త్రీజాడఁ గనిపెట్టఁ జూచితిని. కాని లాభములేకపోయెను. ఈమూడు నాలుగు సంవత్సరము లనుండి జన్వంతరావుకూడ మిక్కిలి పాటుపడుచున్నాఁడు—'

'అయిన జన్వంతరావునకు నా జనన వృత్తాంతమెల్ల ఈ నాలుగు సంవత్సరముల నుండియుఁ దెలియునా?'

'నేనే చెప్పితిని, అతనికిఁ బాగుగాఁ దెలియును.'

'మఱి పూర్ణకీర్తి నన్నేల ప్రేమించుచుండెనో!'

'ఆతనికి జన్మలబ్ధము ప్రధానముకాదు— గుణరూపములు ముఖ్యమని ప్రప్రథమముననే చెప్పియున్నాఁడు.'

'జస్వంతా! ఎంత సజ్జనుఁడవు!' అనుచు జవ్వని ప్రేమపూర్వకముగా నిట్టూర్చెను 'నీకేమియు సందేహములు లేవా?' అని జనపరాజు ప్రసంగము మార్చెను

'ఔను ఉన్నవి. మీనిజమైనపేరు వామనరావని అమ్మపేరు కుసుమమ్మయని యిప్పుడు తెలిసినది—కాదా?'

'అవును—ఇంకను?'

'మధుసూదనరావుగారి కీవిషయమెల్లఁ దెలియునా?'

"తెలియును—కాని నీతో నీజన్మవృత్తాంతము చెప్పువఱకు నేను వెనుకటి మారుపేరుతోడనే ఉండఁదలఁచితిని. నేనును మీపెంపుతండ్రియు, జస్వంతరావును నొక పలుకుబడి మీఁద నడచితిమి."

"తలిదండ్రు లెవరో తెలియనిదానవగు నన్ను మధుసూదనరావుగారు పెంచుకొననెట్లంగీకరించెను? ఆయన మిక్కిలి ధనికుఁడు—వలెనన్న నన్ను మించినవారు పెక్కుమందిలేరా?'

"జస్వంతరావువలెనే మధుసూదనరావుగారికిఁ గూడ గుణరూపములే ప్రధానము—"

"చిత్రమే! ఈవెంటికిని నేనే దొరికితినా?"

“ఇవును మిగిలిన సందేహములు?”

‘నేను పుట్టినప్పుడు మీరేయూరిలో నుంటిరి?’

‘మల్లాపురములో నుంటిమి.’

“తరువాత?”

“నీవు జన్మించిన పిమ్మట సంవత్సరమునకు మల్లాపురము విడిచి నెల్లూరుచేరితిమి. అప్పుడు బదేండ్లుండునప్పటికి తలవని తలంపుగా జన్మాంతరావుతోఁ బరిచయమాయెను”

“మాఅమ్మ—అనగా కుసుమమ్మగారు—చనిపోవుటయే ఆపరిచయమునకు గారణము. ఆసంగతి నాకుఁ దెలియును. మీఁదుమిక్కిలి మనము జన్మాంతరావు మూలకముగా నెల్లూరువిడిచి లక్ష్మీపురమువచ్చుటకూడ నాకు బాగుగా నెఱుకయే కాని నీవు మల్లాపురమునేల మొదట విడిచితివి?”

“జీవనముజరుగక—నెల్లూరిలో నాకుఁ బరిచయుమైన యొక పెద్ద మనుష్యు నాశ్రయించితిని. ఆయనదయచే నాకిప్పటి జీవనోపాధి యేర్పడెను.”

‘మీకు నేను మిక్కిలి శ్రమయిచ్చియుందును. నన్ను కని విడిచిపోయినతల్లి తల్లిగాదు. నిజముగా కుసుమమ్మగారే నాకన్నతల్లి. మీరే నాకన్నతండ్రి. నేను మీగర్భావాసముగనే యెంచుకొనుచున్నాను.’

ప్రేమతో బాష్పములు స్రవింప, వామనరావు బాలికను గాఁగిలించి శిర మాఘ్రాణించెను. మాణిక్యమును సంతోషా

శ్రీవులతో నాతనికంతయు తనమృదుహస్తములతోఁ బెన
వైచెను.

'నాకు పేరుపెట్టినది మీరా, లేక, నన్నుకన్న యామెయా?' మాణిక్య మాతని నడిగెను

'మేమే, అని నామునాప్రు ప్రత్యుత్తర మిచ్చెను.

ఆసమయమున శరీరా గదితలుపు నిశ్శబ్దముగాఁ దెఱచు కొని జన్వంతరావులోని కేతెంచెను.

---

## పదుమూడవ ప్రకరణము

### మఱియొక వింత

జన్వంతరావొకయాసనము నధిష్ఠించుపటికి మాణిక్య మాతనిఁ జూడలేదు ఆమె బసవరాజువైపు తిరిగి సంభాషించు చుండెను. కాని బసవరాజాతని రాకను గనిపెట్టి చిఱునవ్వుతో నాతని నాహ్వాన మొనర్చెను జన్వంతరావు మందహాసముతో గన్నుగీటెను. దీనిలో మాణిక్యము తన్ప్రియుని జూచుట తటస్థించెను. కృతజ్ఞతచే గళగళలాడుచున్న ముద్దుమొగముతో నామె లేచి జన్వంతరావును సమీపించెను. ఆతఁడు నాసనము విడిచి యామెను గాఢపరిరంభణ మొనర్చెను, కాముకీకాముకు లిద్దరు నొండొరులమనసులలోని యభిప్రాయములు గ్రహించు కొనిరి. అంతట నెదురుగ నాసనములపైఁ గూర్చుండి వారిట్లు ముచ్చటించుకొనఁదొడఁగిరి.

'నీజననవృత్తాంతమంతయు వామనరావుగారు తెలిపి యున్నారా?' అని జస్వంతరా వామె నడిగెను.

'పూర్ణముగాఁ జెప్పినాఁడు.' మాణిక్యము సమాధానముచెప్పెను. మధుసూదనరావుగారికిఁ గూడ నీసంగతియెల్లఁ బూర్తిగాఁ దెలియునఁట—కాదా?'

'అంతయుఁ దెలియును.'

'మొదట—ఇట్టి నన్ను ప్రాణతుల్యముగఁ బ్రేమించుచున్న నీకు జన్మమెల్ల కృతజ్ఞురాలను—దాసురాలను.'

'చెప్పవద్దు—' అని జస్వంతరావు నవ్వెను.

'తరువాత నన్ను పెంచుకొనుచున్న మధుసూదనరావు గారికి యావజ్జీవము మిక్కిలి విధేయురాలను.'

'అది నాకు సమ్మతమే.'

ఇఁక దాపరిక మెందులకు?'—వామనరావుగారిని నిజమైన పేరునే పిలుచుచుందును. ఏమి?'

'అట్టే.'

'కాని—కాని దాసీ లలిత కనుమానము గాదా?'

'భయము లేదు ఆసంగతియెల్ల నామె కిదివరకే తెలియును.'

మాణిక్యము దిగ్భ్రమ చెందెను.

'దాసికా! లలితకు? నాజన్మరహస్యమా? ఎవరు చెప్పిరి?'

'నేను' అని జస్వంతరావు శాంతముగాఁ బ్రత్యుత్తర మొసగెను.

మాణిక్యము మఱింత వింతచెందెను.

'నీవా. ఆమె కేల చెప్పితివి ?'

'అవసరముండి — ఆవిషయము త్వరలోఁ దెలిసికొనఁ గలవు. ప్రస్తుత మడుగఁగూడదని నాకోరిక — అది యటుండ చుము. నేఁటిరాత్రి వింతలువుట్టునవి నీకుమఱియొకవింత తెలుప వలసియున్నది.'

'ఏసంబంధము ?'

'నన్ను గూర్చి.'

'నిన్ను గూర్చియా ? అయిన అవశ్యము జాగ్రత్తగా విందును.'

'గంభీరభావముతోఁ గూడ వినవలెను.'

'తప్పక'

'అయిన వినుము.'

మాణిక్యము చెప్పవాల్పక జస్వంతరావును తన విశాల మనోహర నీలనేత్రములతోఁ జూచుచుఁ గూర్చుండెను. అతఁడు గంభీరభావముతోఁ బ్రసంగమును మరల నిట్లారం భించెను.

'నేనెవఁడనుగా మీతోఁ జెప్పియుంటిని ?'

'నీవా ? మాది దక్షిణాదియనియు. నీవొక సంపన్ను ని

ఏకపుత్రుఁడ వనియు, నీకు బంధుగులొక్కరును లేరనియుఁ జెల్పితివి.'

'దేవునిదయవల్ల నేను సంపన్నుఁడ ననుట వాస్తవమే. కాని కొన్ని విషయములలో సదుద్దేశముతో నేను నిన్ను హృదయపూర్వకముగా మోసపుచ్చితినని యిప్పుడు చెప్పుచున్నాను.'

మాణిక్యము తనచెవులను నమ్మని ట్లగపడెను.

'ఏమి, జన్వంతా ! నీవు నన్ను మోసగించితివా ?'

'అవును.'

'కానిమ్ము. నీమోసమును నేను మనఃపూర్వకముగా క్షమించెదను. సదుద్దేశముతోఁ జేసినట్లు చెప్పుచున్నాఁడవు. నీయుద్దేశ మేమి ? మున్ముందుగా నీవు చేసిన మోసస్వభావ మెట్టిది ?'

జన్వంతరావు కొంచెదికాలము మాణిక్యమును నిదానించి చూచి యిట్లనెను.

'నేను నిజముగా నెవ్వఁడనో నీకుఁజెప్పలేదు. ఇప్పుడు చెప్పుదునా ?'

'చెప్పుము.'

'నీవు నాపేరు వేరువిధముగా వార్తాపత్రికలలో చదివియున్నావు. నాపేరుచాలవఱకు వ్యాపించినదని యెఱుఁగుదువు.'

జన్వంతరా వాగెను. మాణిక్యము తెల్లబోవఁజొచ్చెను.

'అట్లయిన___'

మాణిక్యం! ఇప్పటికిని తెలియునా?'

'నీవు—నీ—వు—ప—గ—టి—'

ఆమె పై మాటల నుచ్చరింపలేకపోయెను.

'అవును దశదిశలు పేరుమ్రోగుచున్న యాపగటి చుక్క నేనేను' అను జన్వంతరావు శాంతముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను.

మాణిక్య మొక్కమారుగఁ గంపించి, తల వక్షముపై వ్రాల్చి, దీర్ఘముగాఁ బది నిముసములకాలము యోజించుచు నిలువఁబడెను జన్వంతరావు యాయోజనాపర్యవసానమునకై నెమ్మదిగా నిరీక్షించుచుండెను.

ఎట్టకేలకు మాణిక్యము తలయెత్తెను ఆమెముఖమున నెట్టి మార్పును జన్వంతరావునకుఁ దోఁచలేదు.

'సరిగా నీసమయమున నీసంగతి నాకేల చెప్పితివి?' అని యామె మెల్లగాఁ దన ప్రియునడిగెను. ఆకంఠములో నెట్టి తొట్రుపాటును లేదు.

'రేపు మధుసూదనరావుగారిని నీహస్తము నడుగఁ బోవుచున్నాను. ఆయన యంగీకరించునని వేఱే చెప్పనక్కఱ లేదు. నీవున్ను ఇదివఱకు సమ్మతించితివి. పెండ్లియైన పిమ్మట నాగుట్టు బయలు పెట్టి నిన్ను కలచుటకంటె, వివాహపూర్వమే తెలిసిన నీయిష్టాయిష్టములు కనుఁగొనవచ్చునుగదా?'

'ఉదారమనస్కుఁడా!' అనుచు మాణిక్యము తటాలున

నాతనికంతయును, దనమృదుహాస్యముచేఁ జెప్పెను. 'మన యాత్మ లొండొంటితో నైక్యమైనవి. వానిని విడదీయుట యసంభవము—అనవసరము. మహాప్రభు వైనను—కూడదు, గుడ్డలేని దరిద్రుఁడైనను నాజస్వంతుఁడు నాజస్వంతుఁడే!—మాణిక్య మాతనిని లవమును రోయఁజాలదు.'

'పగటిచుక్క చోరమాత్రుఁ డని యెంచకుము. క్రమక్రమముగా నాచరితము తెలిసికొనఁగలవు అప్పుడు నా నడవడి నీకు విశదమగును. నాచర్యలు—'

'ఏమి నీవింత చెప్పవలెనా? అనుమానించువారికి నీవిషయములు పూర్ణముగాఁ దెల్పికొనుము.'

జస్వంతరావు పరమానందము చెంది సుశీలయగు మాణిక్యమును వెడఁద నుదుటిని ముద్దాడెను.

'మాణిక్యం! ఇఁక నాకు లోకములోఁగల యొక్క బంధువును నీకిప్పుడు చూపవలసి యున్నది.'

మరల నాజవ్వని యాశ్చర్యముచేఁ బాలిపోయెను.

'నీబంధువా?—ఇప్పుడు చూపెదవా?'

'ఔను—అమ్మా!' అని యాతఁడు పిలిచెను.

అచిరకాలములో లలిత యాగది ప్రవేశించెను.

'లలిత—మీతల్లియా! దాసి—దాసి—కాదా?' అనుచు మాణిక్యము మితిమీఱిన విస్మయముచే దడఁబడ బడసాగెను.

'దాసి కాదు—నన్ను కన్నతల్లి! నా ప్రియజనని' జన్వం-
తరావు ప్రౌఢముగా సమాధానము చెప్పెను.

'ఈ క్షణమునుండియు నా ముద్దుల తల్లి!' అనుచు మాణిక్య
మామె కౌఁగిటిలోని కురికెను.

ఆనందముతో లలిత మానుందరిని లాలించఁజొచ్చెను.

---

## పదునాలుగవ ప్రకరణము

### వధువు ప్రార్థన

లలితయు, జన్వంతరావును, మాణిక్యమును మూఁడు
కుర్చీలపై నాసీనులైరి. మాణిక్య మొకపెద్దకలనుండి నాఁటి
రాత్రి మేల్కొనినట్లుండెను. ఈ పదునైదేండ్ల నుండియు నామె
యొక్కటే కలకనుచుండెను. ఇప్పు డాస్వప్న మేఘములు విచ్చి
పోయి సత్యభానుఁడు ప్రకాశించుచున్నట్లామెకుఁ దోఁచెను.
మొదట వామనరావును, నాతనిభార్యయు, దరువాత జన్వంత
రావును, పిమ్మట మధుసూదనరావుగారును జిట్టచివరకు దాసి
లలితయు—వేయేల? తనకుఁ బరిచయముగలవారెల్లరు తనను
మోసపుచ్చిరి. తనయెడల వింతగాఁ బ్రవర్తించిరి. తానో? తాను
వారాడించినట్లాడి తనను తానే మోసపుచ్చికొనెను. అయిన
నామె యుదారస్వభావము చివుక్కుమనలేదు. అంతయుమనో

హారమగు గారడీగా నామె భావించుకొనెను. ఇప్పుడు చిత్ర
ధూమమంతయు నిచ్చి వస్తువు లామెకు స్వప్నరూపములతోఁ
గనఁబడఁ దొడఁగెను.

అనేక విషయము లామె జన్వంతరావు నడుగఁదలఁ
చెను. కాని వింతయెల్లఁ బూర్తిగా నణఁగకు యామె మాటి
మాటికి నాసంగతులే తలపోసికొనుచు 'బసవరాజు నాతండ్రి
కాఁడా? కుసుమమ్మ నాతల్లి కాదా? జన్వంతరావు జన్వంతరావు
కాఁడా? లలిత లలితకాదా?— ఇదేమిచిత్రము? క్షణములోఁ
బ్రకృతియెల్ల నొక్కమారుగ మారినట్లయినది!' అనుకొను
చుండెను.

'నీ కనుమానములున్న జన్వంతరావు తీర్చును. నేను
పోయెదను.' అని చెప్పి లలిత వెంటనే నిష్క్రమించెను.

గదిలోఁ గొంత ప్రసంగము జరుగును.

వధూవరుల నీతరుణమున నొంటిగ విడుచుట యుక్త
మమని యామె గ్రహించి యట్లొనర్చెను.

ఆమె నిష్క్రమించిన తరువాత జన్వంతరావు తనకుర్చీ
మాణిక్యము కుర్చీ ప్రక్కకులాగి, యామె భుజము తట్టుచు
నిట్లనెను.

'వింతచే నేమియు మాటాడలేకుంటివా?'

'అవును.'

'నిజమే. వింతగానే యుండును. తేపు మధుసూదన
రావుగారితోడను, వామనరావుగారితోడను నేను పగటిచుక్క

సని చెప్పవద్దు. నాయనుజ్ఞ యగువఱకు వారి కావిషయము దెలుపకుము.'

'అట్లే కానిమ్ము. కాని లలితమ్మ మీాయమ్మ యను సంగతి?'

'రేపు నేనే చెప్పెదను.'

'మంచిది కాని నీ వీపగటిచుక్క పేరుతో నెన్నా ళ్ళుంటివి?'

'సుమారు నాలుగు సంవత్సరములు.'

'అనగా, మేము నెల్లూరులో నున్నప్పుడు నీతో మాకు బరిచయ మాయెనుగదా? అప్పటికి నీవు పగటిచుక్కగా నుంటివా?'

'ఉంటిని—అదే క్రొత్త.'

'ఈవృత్తి నేలకొంటివేల?'

ఇప్పుడు చెప్పఁజాలను. సమయమువచ్చినప్పుడు తెల్పెదను. రేపు మధుసూదనరావుగారితో సంభాషించునపుడు తెలిసికొనఁగలవు.'

'ఇట్లెన్నా ళ్ళుండఁదలఁచితివి?'

'భగవంతునిదయ.'

మాణిక్యం ఆలోచించుచు నాతనిజూచి 'నేను వధువును రేపు నాపాణి నదుగబోవుచున్నావు—కాదా?' అని అడిగెను.

'అవును.'

ఆమె యాతనికంఠము కౌఁగిలించి, తనతల యాతని వక్షముపైఁ జేర్చి యాతని నేత్రములఁ దిలకించుచుఁ బ్రేమతో నిట్లనెను.

'వివాహమునకు ముందు వధువున కొక ప్రార్థనగలదు.'

జస్వంతరావు గంభీరముగా చింతింప నారంభించెను. మాణిక్యము నిట్లనెను.

'పేరు వినినంత జనులు గజగజవడకు పగటిచుక్క మహాత్మ్యము నేనెఱుఁగకపోలేదు. ఆతని సాహసములు పత్రికలలో విని చెప్పరానిసంతసించుచుండెడిదానను. కాని జస్వంతుఁడే భయంకరుఁడగు నాపగటిచుక్కయని నేనెఱుఁగను. నాకోరిక స్వల్పము—నీకడ్డములేదు నాప్రార్థన దీర్చెదవా?'

'చెప్పుము' అని యాతఁడు నెమ్మదిగా ననెను.

'నీవీపదం నేయుద్దేశముతోఁ బూనితివో, యేయభిప్రాయముతో నిట్టి ఘోరసాహసముల నొనర్చుచుంటివో నీకేయెఱుక—భగవంతునికెఱుక, నాప్రార్థన యేమన, నీ యుద్దేశము నెఱవేఱిన వెంటనే—అనుక్షణమే—నీవీ వృత్తి వదలవలెను. లేనిచో నామనసునకు శాంతి యుండదు—'

'ఈసమయమున నీకోరిక నిరాకరింపను. అట్లేయగుఁగాక! అయినను మిక్కిలి బలవంతముగ నాసమ్మతి నిచ్చుచున్నానని మాత్రము తెలిసికొనుము—మఱియొకరైన దానిని జన్మలోఁ బొందఁజాలరు.' అని పగటిచుక్క దృఢముగాఁ జెప్పెను.

మాణిక్యము మాటుమాటాడక తలయెత్తి తనకుఁ దానే యాతని ముద్దాడెను. దానివలన నామె యానందము జన్వంతరావునకు విశదమాయెను.

'నీనిజమైనపేరు నాకుఁ జెప్పవచ్చునా ?' అని కొంత సేపుండి యామె యడిగెను.

'చెప్పరాకేమి ?——కాని నీకుమాత్రము జన్మాంతము నేను జన్వంతరావునే.'

'అట్లే' అనుచు నామె సంతోషము చూపెను.

'రేపు భోజనములైన తరువాత మధుసూదనరావుగారి ముఖ్యవిషయములు తెలిసికొనఁగలవు. నేటిరాత్రి కివి చాలును.'

'ఈనాఁటిరాత్రి నాజీవితములో మఱవఁజాలను !'

'పోయి పరుండి విషయము లేకరువు పెట్టుకొనుము' అనుచు జన్వంతరావు లేచెను. మాణిక్యమును లేచెను. ఒకరి చేతి నొకరు ముద్దాడి వారు తమతమ గదులకుఁ జనిరి.

---

## ప దు నై ద వ ప్ర క ర ణ ము

---

### మ ఱు నాఁ డు

తెల్లవాఱెను. క్రమక్రమముగాఁ బదిగంటల ప్రొద్దెక్కెను. తారామందిరములో నెల్లరును దినకృత్యంబుల నిర్వ

రించి భోజనములో నర్చిరి. అప్పుడు జస్వంతరావు మధుసూదనరావుగారి గదిలోనికిఁ బోయెను. అచ్చట మాణిక్యము గూర్చుండ యాతనితో ప్రసంగించుచుండెను. మధుసూదనరావు జస్వంతరావునకు కొక యాసనము చూపెను. యజమాని యెప్పటివలెనే పరుండియుండెను. ఆతఁడు నెత్తిపై నూలుటోపీని తీయలేదు. వక్షముక్రిందనుండి యొక పచ్చడము కప్పుకొనెను. ఆతని చూపులు పగటిచుక్కపైఁ బ్రసరించెను.

'నేను మీతోఁ గొన్ని ముఖ్యవిషయముల గూర్చి మాటాడ వచ్చితిని.' అని జస్వంతరావు గంభీరముగా జెప్పెను.

'నిరభ్యంతరముగ మాటాడవచ్చును.'

'మీ కాటంకము లేనిచో వామనరావుగారిని, లలితను గూడ పిలిచెదను సమ్మతమా?'

'కాకేమి?—నేటినుండి యిఁక బసవరాజును వామనరావని పిలువవచ్చునని తలఁచెదను—కాని—కాని—మఱచితి.'

'ఏమి?'

'దానికి లలిత కనుమానము కలుగును.'

జస్వంతరావు చిఱునవ్వునవ్వెను. కాని మరల దానిని మార్చి గంభీరముగా నాతఁ డిట్లనెను. లలితకు సందేహము కలుగదు—అది చెప్పెను. వామనరావుగారిని, ఆమెను బిలుతునా?'

'పిలువుఁడు.'

జస్వంతరావు గదివాకిటదగ్గఱకు వెడలి క్రిందనున్న లలితకేదో సంజ్ఞచూపెను. ఆ చిరకాలములో నామెయు, వామనరావును మేడపైకివచ్చి యాగది ప్రవేశించిరి. అందఱు నుచితాసనములపై నధివసించిరి. అంతట జస్వంతరావు లేచి వక్షస్థలముపై జేతులు ముడిచి యిట్లనెను.

'ఇచట నున్న వారందఱును నాకాప్తులే. నా వాక్యములను జాగ్రత్తగా విందురు గాక—'

అందరును గంభీరముగా జస్వంతరావును దిలకించుచుండిరి. అతఁడు క్షణముండి మరల నిట్లనెను

'మాకులాచారప్రకారము వివాహసమయమునందు— అనఁగా ముందు వధూవరుల నిజస్థితిగతు లొండొరులకుఁ బూర్తిగాఁ దెలిసియుండవలెను— తప్పదు నేనా యాచారము ననుసరించితిని. మాణిక్యము విషయము నాకాద్యంతమును దెలియుననుటకు మధుసూదనరావుగారు సాక్షి—వామనరావు గారు సాక్షి— మాణిక్యము సాక్షి యీలలిత సాక్షి.

మధుసూదనరావు గారు విస్మయముచెందెను. వామనరావు నివ్వెరపోయెను. మాణిక్యము చలించ లేదు.

'మాణిక్యము విషయము దాసికెట్లు తెలియును' అని మధుసూదనరావు తత్క్షణమే ప్రశ్నించెను.

'నానిజనామము—ఈపిల్ల జననము నీ కెవరుచెప్పిరి?' అని వామనరావు వెంటనే యడిగెను.

'నేనే చెప్పితిని ' అని జస్వంతరావు శాంతముగా సమాధానమిచ్చెను.

గృహయజమానివింత యినుమడించెను. వామనరావు వెలవెలపాటు కూడ ద్విగుణించెను.

'నీవా! అని యుభయులు నేకకంఠముగా నడిగిరి.'

'అవును నేనే—కారణముగలదు.'

'ఏమి?' అని యిరువురు నొక్కమారడిగిరి.

'చెప్పెదను. నాతల్లికిఁ దెలియకుండ నేను వివాహమెట్లు చేసికొందును— లలిత నాకన్నతల్లి.'

మధుసూదనరావు లేచికూర్చుండెను. వామనరా వాసనమువీడి జస్వంతరావున కెదురుగ వచ్చెను వారు చెందిన దిగ్భ్రమ యపారము. మాణిక్యము మాత్రము వదనభావము మార్చక యట్లే కూర్చుండెను.

'అయిన మాణిక్యమునకీవిషయము తెలియునా?' అని మధుసూదనరావు జస్వంతు నడిగెను.

'తెలియును.'

'ఎప్పటినుండి?'

'నిన్న రాత్రినుండి.'

'చెప్పితివా?'

'అవును—వివాహపూర్వ మామెకు నానిజవిషయమంతయు సవిస్తరముగాఁ దెలిపియుంటిని.'

'మాజీ మాకుఁ జెప్పక దాసిగా ఆమెను నాయొద్దఁ బ్రవేశపెట్టితివా?'

'అవును.'

'కారణమేమి?'

'నాచరిత్రం మీకేప్పుడుఁ గొంతవఱకుఁ దెలుపవలసి యున్నది. పెండ్లివిషయమునకది యనవసరమగుట మాణిక్యమునకు సహితము దానిని జెప్పలేను. ఇప్పుడు మాణిక్యము హాస్యమును మిమ్ముఁదుగవచ్చితిని గాన మీకుఁ జెప్పవలెను.

'నీప్రవర్తన వింతగా నున్నది, లలిత నీతల్లియా! నీచిత్ర చరిత్రము విన నాకాత్రముగా నున్నది.'

'కూర్చుండి యుపక్రమింపుము.' అని వామనరావనెను.

'కాను. ఇట్లే చెప్పెదను.' అని జన్వంతరావు నెమ్మదిగఁ బ్రత్యుత్తర మిచ్చెను.

'అట్లే కానిమ్ము.' అని గృహయజమాని హెచ్చరించెను.

'అయిన వినుఁడు.'

జన్వంతరావు నిజవృత్తాంతము క్లుప్తముగా వారికిట్లు చెప్పెను. చెప్పుచున్నంత సేపును లలిత శిరమువంచుకొని యుండెను. జన్వంతరావు గోడవైపు చూచుచుఁ దనకన్నుల యెదుట జరుగుచున్న దానిని వర్ణించుచున్నట్లు చెప్పఁ దొడగెను.

## పదునాలుగవ ప్రకరణము

### పిశాచ ద్వయము

'నేనిప్పుడు తెలుపఁబోవు సంగతి చాలకాలము క్రిందట జరిగినది. ఈవృత్తాంతము నడచి రమారమి ముప్పది సంవత్సరములైనది — అవును. సుమారు ముప్పదేండ్ల క్రిందట జరిగిన యొక సమాచారము మీ కిప్పుడు వినఁబోవుచున్నారు......'

'నెల్లూరు పేరు మీరు వినియేయున్నారు. వామనరావు గారు, భార్య మాణిక్యము నచటఁ జాలకాలము నివసించినారు. ముప్పదియేండ్ల క్రిందట నెల్లూరులో నొక బీదయాతఁడుండెడివాఁడు. ఆతఁడు హరిహరబావాజీ యను చిత్రనామమునఁ బిలువబడుచుండెడివాఁడు. నేను చెప్పుచున్న సమయమున హరిహరబావాజీ తన ఏకపుత్రికతో నొక పూరింట వసించుచుండెడివాఁడు. ఆయన కుమార్తెకుఁ బదునాలుగు సంవత్సరములుండెను. ఆమె తనతల్లి నెంతమాత్రము నెఱుఁగదు. గ్రాహ్యశక్తి వచ్చిన నాఁటనుండియు హరిహరబావాజీ ముఖమే యామెకు జ్ఞాపకము. బావాజీ భార్యను నెల్లూరులో నెవ్వరును జూడలేదు. ఆతఁడాపురమున కొంటరిగా వచ్చెను— అనగా భార్య లేకుండనని నాయుద్దేశము. కూఁతును మాత్రము తల్లిని మఱపింపఁజాలిన శ్రద్ధతో బెంచెను. చెప్పమఱచితిని— ఆబాలిక పేరు పద్మ.

'పద్మకుఁ బదునాలుగేండ్ల వయసువచ్చెనని చెప్పెను. ఆమె వ్యక్తురాలాయెను హరిహరబావాజీ యామె వివాహము విషయమై యాలోచించుచుండెను. పద్మయొకరినిఁ బ్రేమించి యుండలేదు. ఆమె తండ్రి భగవద్భక్తులలోఁ బెరిగినపిల్ల, ఒకరిని కన్నెత్తి దురూహలతోఁ జూచి యామె యెఱుఁగదు. తలవనితలంపుగా నొక వరుఁడు బావాజీకి దొరకెను. అతనినిఁ గూర్చి యిప్పట్టునఁ గొలఁదిగఁ జెప్పవలసి యున్నది.

'హరిహరబావాజీ యింకను కుమార్తె పెండ్లి తలపెట్టకపూర్వమే వారియింటి కిరువదియేండ్లుదాటిన యౌవనుఁ డొకఁడు వచ్చుచుండెడివాఁడు ఈ యౌవనుని పేరు ప్రస్తుతము చెప్పను. అతఁడు సుందరుఁడు—బలిష్ఠుఁడు—చామనచాయగానుండెడివాఁడు. ఆతరుణుఁడు పద్మ సౌందర్యమునుజూచి యామెను బ్రేమించెను. బావాజీగారియింటికిఁ దఱుచుగ వచ్చుట మొదలుపెట్టెను. తండ్రికి, ఆయౌవనుని కోర్కెలుక వ్యానో పద్మకు లేశమునుఁ దెలియదు. కాని యాతని రాకలకుమాత్రము బావాజీ యెట్టి యభ్యంతరమును జెప్పలేదు. ఒకనాఁడు సూచనగా బావాజీ యామెతో నాయౌవనుఁడు తన కల్లుఁడైన బాగుగనుండునని ప్రసంగించెను. పద్మ మాటాడలేదు. కాని యామె మౌనము వరునియం దిష్టముగా నుంటచేతఁగాదు. నిత్యము నాతరుణుని జూచుచున్న యామె మనము క్రమక్రమముగా నాతనిసౌందర్యమును జూఱగొనెను

ఆప్రసంగమునుబట్టి పుత్రిక యుద్దేశమును నిర్ధారింపఁ జాలక బావాజీ యాయువకుని, ఆమెను నొంటిగవిడిచి, వారిసంభాషణ తాను చాటున వినుచుండెను. ఈ సంగతి వరునికిఁ దెలియును కాని వధువునకు తెలియలేదు

'యువకుఁడు మందహాసముతో స్వేచ్ఛగాఁ బ్రసంగమారంభించెను. ఆతఁడు పరిచితుఁడగుటచేతఁ బద్మయు మును పటియంతగా లజ్జింపక యాతనితో సంభాషించెను. ఉభయులు నిట్లు ముచ్చటించిరి.

'పద్మా ! నీతోఁ గొంత సంభాషింపవలసి యున్నది— మీతండ్రి యనుమతి మీఁదనేనుమా !

'అయిన జెప్పవచ్చును.'

'విషయము మృదువిషయము—'

'యువకుఁ డాగెను పద్మ గ్రహించెను.'

'నీవు సిగ్గుపడక చెప్పవలెను.'

'అడుగుఁడు.'

'పద్మా! నేను దురుద్దేశముతో నడుగుటలేదు. నీమనసున నెవ్వరినైన వరించియుంటివా?'

'లేదు, అని యామె యువనతశిరస్కయై చెప్పెను.'

'అయిన—మీతండ్రి సమ్మతించిన— నన్ను వివాహమాడుటకు నీకెట్టి యభ్యంతరమైనఁ గలదా?'

'పద్మ ప్రత్యుత్తర మీయలేదు. ఆమె యోజింపనారంభించెను. కొలఁదికాల మామెకు గడవిచ్చి యువకుఁడు మరల నిట్లులనెను.'

'ఏమాలోచించుచున్నావు?'

'మీస్థితిగతులు, వృత్తాంతము నాకుఁ బొత్తిగా దెలియదు.'

'అన్నియు మీతండ్రిగారికిఁ దెలియును— యుక్తసమయమున నీకునుఁ దెలిపెదము— ప్రస్తుతము కాదు.'

'పద్మ మరల యోజించనారంభించెను.'

'బావాజీ సజ్జనుఁడు, నిన్నాతండు మోసపుచ్చునా?'

'మాతండ్రియందు నాకు నమ్మకము గలదు ఆతడంగీకరించిన నేనొప్పుకొనినట్లే' అని యామె మెల్లగఁ జెప్పెను.

'మిక్కిలి సంతోషము— మామగారూ!'

బావాజీ నవ్వుమొగముతోఁ బ్రవేశించెను. తమసంభాషణ నాతఁడు వినుచుండెనని పద్మ తెలిసికొనెను. వారు మఱి కొంతసేపు ప్రసంగించిరి. ఒకనెల కడచులోపల పద్మయా యువకునిఁ బెండ్లాడెను. వివాహమున కిరువైపుల బంధుగులు లేరు. పెండ్లి యొక్కదినములోఁ గ్లుప్తముగా జరిగెను.

నాఁటినుండియు నాయువకుఁ డచ్చటనేయుండెను. ఒక యర్థ సంవత్సరకాల మాతఁడు పద్మను కంటికి ఱెప్పవలెఁ గాచుచుండెను. తరువాత బావాజీగారి దార్ఢ్యమును, యువకుని ప్రేమ

యుఁ గ్రమక్రమముగా క్షీణింపఁదొడఁగెను. కౌమార్తె వివా
హమై సంవత్సరమునిండిన తరువాత బావాజీగారు హఠాత్తుగ
మృతినొందిరి. గత పూర్వకథయందు చదివినట్లు పద్మ గత
పితృక కూడ నామెను యొకర్కఁ డామెను గొంతరోదార్చెను
అప్పటికి పద్మ కేవల నెలల గర్భము. మనుమల జూచుభాగ్యము
లేక గతించెనని పద్మ బావాజీనిగూర్చి మఱిమఱి మఱియు
వాపోయెను. తనకు రానున్న గొడ్డలిదెబ్బనామె తెలిసికొనజాల
దాయెను.

హరిహరబావాజీ మరణించిన కొలఁది దినములకు
పద్మను పలువురఁ జంపఁజాలిన విషయమొకటి యామెకు సంభ
వించెను. ఒకనాఁటిరాత్రి ఆమెభర్త యెంతసేపటికి నింటికిరా
లేదు. వింతతోడను భయముతోడను నామె యాతనిరాక
కెదురు చూచుచుండెను. అర్ధరాత్రియగు కావచ్చుచున్నప్పు
డొకపురుషుఁ డామెయున్న పూరింటికి వచ్చెను. ఆతఁడామెకు
క్రొత్తవాఁడు.

'ఏమిపనిమీఁద—' అని పద్మ యాతని ప్రశ్నింపఁ
బోయెను.

'నాకు వేళలేదు—' ఆపురుషుఁ డడ్డమువచ్చి చెప్పెను
నీభర్త నీపెండ్లికి ముందు నాకూఁతును. పెండ్లియాడినాఁడు.
నిన్ను దొంగతనముగాఁ జేపట్టినట్లు నాకుఁ దెలిసినది. రెండే
సంగతులు ఈకాగితముమీఁద దస్కతుచేసిన నిన్నాతఁ డప్పు

దుష్టాహు వచ్చి చూడవలెనని జూచును. లేనిచో జన్మలో నిరువురు నొకరి నొకరి చూడరు.

'పాలిపోయినట్లున్న ముఖముతో, గజగజవణకి, పద్మ యేమియు మాటాడలేదు. ఇంతలో నామె భర్త యాకస్మికముగా నచటికి వచ్చెను. దీనముగా నామె యాతనిం జూచెను. కాని యాతనియొద్ద జాలి కనుపట్టలేదు.

'పద్మా! నామాటవిని దస్కతు పెట్టుము. లేనిచో జన్మలో నిదియే కడసారి చూపు.' అని యాతండు కఠినముగా ననెను.

'ఆతని కంఠస్వరమందలి కాఠిన్యము పద్మ నొక పెద్ద సుఖ స్వప్నమునుండి మేల్కొలిపెను. ఒక్కమారుగ నామె కెచ్చటలేని మనోధైర్యము వచ్చెను.

'ఆకాగితమేమి?' అని యామె తీవ్రముగా భర్తనడిగెను.

'మన యిర్వురికీ పెండ్లి కానట్లును— కేవలము నీవు నాయుంపుడుకత్తెవు మాత్రమని నీకిందు మనస్ఫూర్తిగా నిర్ధారణచేయునట్లు వ్రాయబడినది. సాక్షులిదివఱకే సంతకము చేయించినారు.

ఛీ! నీచుండా!, అనుచు పద్మ లేచెను, నాకంఠమునఁ బ్రాణములుండ నేను దానిపై దస్కతుచేయను ముమ్మాటికిని చేయను.

'అయినచో నన్ను జన్మలోఁ జూడబోవు!' అనుచు నామె

భర్త వెలికి దాఁటిసెను. ఆ క్రొత్త మనుష్యుఁ డాతని ననుస రించెను.

'స్త్రీపగ మాత్రము మఱవకుము!' అని పద్మ తెలిసి తెలియని కేకవైచి స్పృహతప్పి క్రిందఁబడెను.

*    *    *    *    *

జన్వంతరావాగెను. మరల బది నిముసముల వఱకు గన్నులు మూసికొని యాతఁడు పెదవి విచ్చలేదు. ఎచ్చటివా రచ్చట నాత్రముగాఁ గూర్చుండి యీచిత్ర చరిత్ర పర్యవ సానము పరీక్షించుచుండిరి. ఎట్టకేలకు మరల కలనుండి లేచినట్లు జన్వంతరావు మరలఁ జెప్పనారంభించెను.

'అకాలముగ పద్మకొక కొడుకుపుట్టెను. ఏడవనెలన పుట్టిన యాబిడ్డ బ్రదుకుట చాలసంశయములకుఁ గారణమాయెను. చావుబ్రతుకులతో నాబిడ్డ కొంతకాలమునకుఁ బ్రాణము బిగబట్టి క్రమక్రమముగా పొలుగుడుచుచు వృద్ధిపొందఁ దొడఁగెను. మొదటమొదట నాపసిపాపపైఁ దల్లికంత ప్రేమలేదు. కాని బిడ్డపెరిగిన కొలఁదిని తల్లి పుత్రునొక మెత్తుగను, ప్రాణ మొకమెత్తుగనుజూచెను రెండు సంవత్సరములు జరిగినను మగ నిసమాచార మామెకుఁ దెలియలేదు. విచారమును దిగ్రమింగు కొని యామె శిశుపోషణ మొనర్చుచుండెను. మఱి మైదు సంవత్సరములు జరుగునప్పటి కామెకొకదినమున నారువేల రూకలపెట్టెయు, నొకచిన్న యుత్తరమును ఒక పురుషుఁడు

క్షణములోనిచ్చి మాయమై యదృశ్యురాలయ్యెను. ఆమె యుత్తర
మువిచ్చిచూడ తన భర్తహస్తముతో బిల్లవానికొఱకై డాధన
మంగీకరింపవలెనని ప్రార్థించుచున్నట్లుండెను మగని దస్కత్తుం
డెను. మఱెట్టిగుర్తును లేదు.

'పద్మ లెక్కపెట్టినదాక నాకు వేల రూకలుండెను?
వానిని గ్రహించుట కామె రెండుదినములు సంశయించి యెట్ట
కేలకు పుత్రునికొఱకై సొమ్ము స్వీకరించెను. నాఁటినుండియు
వారి కలవ్రుతీరెను. ఒక పరిశుభ్రమైన యింటిలో మాతాపుత్రు
లుసుఖముండిరి తరువాత నేడుసంవత్సరములిట్లే జరిగిపోయెను
భర్తయెచ్చట నుండెనో పద్మకు రవ్వంతయుఁ దెలియదు. ఆవి
షయమున నామె ప్రయత్నింపలేదు ప్రయత్నింపఁదలచుకొన
లేదు. కానీ పాపము దాగదు. తలవనితలంపుగ నామెభర్త
క్రూరకృత్యములును, తనను విడిచినపిమ్మట దుష్ప్రవర్తనయు
నొక్కదినములో లోకమునకుఁ దెలియుట సంభవించెను. అంత
వఱకును పుత్రునిమూలముగా నామె మగనిపైఁ బగదీర్చికొన
దలంచెను. కాని దాని నితరులే—భగవంతుడే తీర్చెను.

జన్వాంతరావు మరల నాగెను. ఈమారాతనికి యోజన
కవకాశమీయక మధుసూదనరావు 'ఆగకుము— చెప్పుము.
ఒక్కనాఁటిలోఁ దనభర్త యుదంతము పద్మకును లోకమునకు
నెట్లు తెలిసెను? అని యుద్రేకముతో నడిగెను.

గృహయజమాని నేకదృష్టితోఁ జూచుచు జన్వాంతరా

విట్లనెను. 'ఇంక సంగతులు దాచను. పద్మవృత్తాంతము కొంత వఱకుఁ బ్రస్తుతము కప్పిపుచ్చి యామెయిప్పు డెచటనున్నది చెప్పెదను.'

'పద్మయా? ఇప్పుడెక్కడ నున్నది?' అని మాణిక్య మాశ్చర్యముతో నడిగెను.

'ఏమి లలిత యా?' అని గృహయజమాని యొక్కమాఱుగ నఱచి యామెవంక చూచెను.

'సీతల్లియా!' అని వామనరావు వెలవెలబోయెను.

'నా అత్త!' అనుచు మాణిక్యము లలితను కౌఁగిలించు కొనెను.

'అవును, నేఁటినుండి—యీక్షణమునుండి—యీ నా తల్లిని—నా దేవతను—పద్మయని పిలువుఁడు,' అని జస్వంత రావు ప్రేమాతిశయమునఁ దల్లిని డాసెను.

'ఆగుము—,' అనుచు మధుసూదనరావాతని నాపి వేచెను. 'ఒకనాఁటిలో నీతండ్రి సమాచారము లోకమున కెట్లు తెలిసెను?'

'పదునాఱు సంవత్సరముల క్రిందట వెంకటరావుగారు ధారాపురములోఁ బ్రచురించిన 'సన్నపుదొంగ' యనుగ్రంథ మూలమున.'

'అయిన నీతండ్రిపేరేమి?' అని మధుసూదనరావు మిక్కిలి యాత్రముగా నడిగి నోరుదెఱచి సమాధానముకొఱకు నిరీక్షించుచుండెను.

నాతండ్రిపేరు జనార్దనరావు—ఆతఁడె కన్నపుదొంగ, అని జన్వంతరావు శాంతముగాఁ బ్రత్యుత్తరమిచ్చి గృహయజమాని ముఖము సూక్ష్మముగాఁ బరికించుచుండెను.

మధుసూదనరావు తెల్లఁబోయి, శరీరము కంపింపఁ బ్రక్కపై వెనుకకు వ్రాలెను.

---

## పదునేడవ ప్రకరణము

---

### “వారిరువురినే!”

జన్వంతరావు తల్లివైపు చూచెను. పద్మ పుత్రునివైపు చూచెను. వారిరువురి పెదవులు చలించలేదు. నేత్రములు సంభాషించుకొనెను. ఆత్మలు గ్రహించుకొనెను. తప్పక మధుసూదనరావు తామనుకొను పురుషుఁడేయని వారిరువురు నిశ్చయించుకొనిరి. కొలఁదికాలము గడచినతరువాత మధుసూదనరావు సెజ్జపై లేచికూర్చుండెను ఆతడే ప్రసంగించుకొనిన ట్లగపడుటచే జన్వంతరావు ప్రత్యుత్తరముల నీయసంసిద్ధుఁడై యాతనివైపు తిరిగెను. వామనరావును, పద్మయు, మాణిక్యమును వారిరువురినిజూచుచు నిశ్శబ్దముగా నుండిరి.

‘నీచరిత్ర మాకుఁ దెల్పుటలో నీయుద్దేశమేమి?’ అని గృహయజమాని జన్వంతరావు నడిగెను.

'నా యుద్దేశము తెలిపెద వినుఁడు, జస్వంతరావు సమాధానము చెప్పెను. మొట్టమొదటిది, నా వంశము మాణిక్యమునకును, నా మిత్రులగు మీకుఁ దెల్పి యామె హస్తము [illegible]గదలచితిని. నా తండ్రి యెవఁడో, తల్లి యెవతెయో వారి పూర్వవృత్తాంతమేమో బొత్తిగాఁ దెలియకుండ మా బాలికను వివాహమాడుట మిమ్ము మోసగించినట్లగును.'

తరువాత ?

'రెండవది. నా ప్రియురాలిని మీ కప్పగించి నేను మా తల్లి పగదీర్పఁబోయి వచ్చెదను.'

'ఎట్లు? మీ తల్లిని మోసగించిన యాతఁడు—ఆ జనార్దనరావు ఆత్మహత్య చేసికొనిన ట్లా పుస్తకములోఁ జదువమా?'

'అవును. అయినను మా పగయింకను దీఱవలసియున్నది'

'చిత్రమే! ఎవ్వరిపై?'

కన్నపుదొంగలో జరిగిన పెద్దమోసము లోకవిదితము. ఆ మోసములో జనార్దనరావునకు సాయమొనరించిన వారిర్వురున్నారు. వారిర్వురిపై నా పగ దీర్పవలసి ఉన్నది.

'వారి పేరులేమి?'

'మీకుఁ దెలియదా? ఒకఁడు సతారాము. రెండవవాఁడు గోవిందంపంతులు—'

మాణిక్యము పెద్ద కేక వేసెను. వామనరావును, గృహయజమానియు నాశ్చర్యముతో నామెవైపు దిరిగిరి.

జన్వంతరావ్ ! నేను చెప్పవచ్చునా ? అని మాణిక్య మున్రేకముతోఁ దనప్రియు నడిగెను.

'చెప్పుము' అని యాతఁడు శాంతముగా ననుజ్ఞయిచ్చెను.

'ఏమమ్మా అది? అని వామనరావు వింతతో నడిగెను.

'నిన్న మీకుఁ జెప్పలేదు, మాణిక్యము సమాధానము చెప్పెను. నన్ను రెండు సారులు నిర్బంధించిన పురుషోత్తమ రావే గోవిందంపంతులు!'

'ఆఁ!, అనుచు మధుసూదనరావు మరల వెలవెల బోయెను.

మాణిక్యము తానావిషయ మెట్లు గ్రహించెనో తెలియ జేసెను. వామనరావును, గృహయజమానియు జెందిన యాశ్చ ర్యమునకు మేరలేదు. మరలఁ గొలఁది కాలముండి మధుసూ దనరా విట్లనెను.

'జన్వంతరావ్ ! సరే, ఒకపగవాఁడు చిక్కినాఁడు—— చిక్కినట్లే యెంచవచ్చును. రెండవవాఁడు ?

'సతారామా ? జన్వంతరావు నిర్లక్ష్యముగా నడిగెను. ఆతఁడును జిక్కినట్లే యెంచవచ్చును.'

'ఏమి? ఆతనిజన్మమెల్ల ద్వీపాంతరవాసశిక్ష వేయలేదా?'

'వేసినారు. కాని నాలుగు సంవత్సరముల క్రిందట నాతఁడు తప్పించుకొనినట్లు తెలియలేదా? ఆతనిని దిరిగిపట్టి యిచ్చినవారికి దొరతనమువారు బహుమానమిత్తురు.'

'బహుమాన మెంత?'

'అయిదుమన్నార్ల రూకలు.'

మధుసూదనరావాలోచించుచు 'అయిన సతారా మెచ్చుట యెట్లు? నీవాతనిజాడఁ గనిపెట్టితివా?' అని యడిగెను.

'నిస్సందేహముగ.'

'అయిన నాదొక సందేహము గలదు. నీశత్రువుల వెదకుచు నీవు కాలము నెక్కువ గడిపితివి. ఇకఁ బిల్ల పెండ్లి యెప్పుడు?'

'మూఁడు నెలలలోపుగ సాధించి వచ్చెదను—వారిరువురినే!'

'ఎట్లు?'

'ఈ గడువులోపల నా శత్రువులు నాకు జిక్కుదురను ధైర్యము నాకున్నది.'

'చిక్కనిచో?'

'చిక్కకపోయినను పెండ్లియాగదు.'

'మంచిది.'

'ఇంకను మాణిక్యము తల్లిదండ్రుల విషయము కొంత పరామర్శ చేయవలసియున్నది. అదియుఁ బెండిలికడ్డమురాదు. దానివిషయమై యిదివఱకే ప్రయత్నించుచుంటిని—ఇప్పుడు ప్రయత్నించుచున్నాను—ఇంకఁ బ్రయత్నించగలను. మీఁదదైవేచ్ఛ.'

ఆవిషయమునఁ గార్యసాఫల్య మొందుట యసంభవమని తలఁచెదను.

'అయిన మనవ్రాసిక యానట తగునా?'

'సరి సేయుదును. మూఁడు నెలలకుఁ దిరిగిరమ్ము. కాని ఒకసంగతి జనార్దనరావు నీకు విరోధికాని, యాతనిస్నేహితు లెట్లు విరోధులు? వారిపైఁ బగతీర్చుకొనవలెనని నీకింత పట్టుదల యేల?'

'ఆ దుర్మార్గుని కృత్రిమములకుఁ దోడ్పడి, యాతనికిఁ దన సోదరిని మాధవి నిచ్చిన సత్యారాముఁడు నిందితుఁడు కాఁడా? వీరిద్దరికిని సాయమొనర్చిన గోపాలకం పంతులు నిందితుఁడు కాఁడా? ఇరువురును——'

జస్వంతరా వాఁగెను. మధుసూదనరావు వెలవెలఁ బోవుచుండెను.

'సెలవు. మరల మూఁడు నెలలలోపుగఁ గలిసికొనెదను.' అని జస్వంతరావు లేచెను.

'ఏమి! అప్పుడే పోకయా?'

'అవును.'

'మేలగుఁగాక పోయిరమ్ము.'

జస్వంతరావు వామనరావునొద్ద యనుజ్ఞ గైకొనెను. అచిరకాలములోఁ దిరిగివత్తునని ధైర్యముఁ జెప్పి మాణిక్యము నొప్పించి యాతఁడును, పద్మయు మేడక్రిందికిఁ జనిరి. జస్వంతరావు కొలఁదిగ సరుదుకొని ప్రయాణమునకు సిద్ధమాయెను. పద్మ యాతని నాశ్లేషించి వీడ్కొనుటకు ముందిట్లనెను.

'నాయనా! మనయనుమానము నిజమైనది.'

'ఆహా ! మధుసూదనరావు మాహాత్మ్యమునకిది పతారామే ! సరే, ఒకఁడు చిక్కినాడు '

'రెండవవాఁడు ?'

జస్వంతరావు వొక యుత్తరమునుదీసి తల్లికిఁ జూపెను. అం దిట్లుండెను.

'సింహాచలం.'

'ఇచ్చట నన్నియు సరిగా నున్నవి. చంద్రము, శ్రీధరము నిచ్చటనే యున్నారు—రాధాయమ్మ వచ్చినది పురుషోత్తమరావుకూడ గర్తపురము చేరినాఁడు. నీవు రావలసిన సమయము.

—రామరాజు.'

కాఁబట్టి—నీవు గర్తపురమునకు వెడలుము.'

'అక్కడకే.'

జస్వంతరావు తల్లిని కౌఁగిలించెను. పద్మ గృహాము లోనికి జనెను. జస్వంతరావు తారామందిరము విడిచెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము

---

శ్రీ ము ఖ

చదువరులను మేము మరల గర్తపురములో రాధా యమ్మ మేడలోనికిఁ బ్రవేశపెట్టుచున్నారము. మేడక్రింది

భాగమున రాధాయమ్మగదిలో నామెయు, శ్రీముఖియు, ఓంకారమును, జ్వాలయు గూర్చుండి ప్రసంగించుచుండిరి. తల్లియు, కుమార్తెయు సంభాషణలో విస్తారముగ భాగస్థులగుచుండిరి. ఉభయులు నేదో దృఢనిశ్చయులై యున్నట్లు కన్పట్టుచుండిరి. మేమిప్పుడు వర్ణింపఁబోవు విషయములపై ప్రకరణమందలి సంగతులు జరిగిన మూఁడుదినములకు జరిగెను. మఱియు రాత్రి యెనిమిది గంటలవేళ జరుగుచుండెను గృహయజమానురాలు కూఁతుతో బల్కుచుండెను.

'ప్రప్రథమమందు మీయిద్దరికి నెట్లు పరిచయమాయెను ?'

'మూఁడునెలలక్రిందట నొకనాఁ డాతనిని మనమేడపై నుండి చూచియుంటిని. అప్పుఁ డాతఁడు వీధిలో నెవ్వరితోడనో సంభాషించుచుండెను.'

'తరువాత ?'

'పలుమాట లెందులకు ? ఆక్షణమునుండియు నాతఁడు మనఃకాంతుఁడయ్యెను.'

'అట్లా ? తరువాత మీ రొకరినొక రెట్లు చూచుచుంటిరి.'

'దినదినము నదేవేళ కాతఁడు వీధిలో నుండుచువచ్చును. నేను మేడపైనుండి యాతనినిఁ జూచుచుండెడిదానను.'

'నీనడత నాకు నచ్చలేదు.'

‘శ్రీమతీ! నా కర్తవ్యముగా నీవిందుకుఁ బ్రత్యుత్తరమీయ లేదు. రాధాయమ్మ మరల నిట్లడిగెను ’

‘రామరాజు అవివాహితుడని నీకెట్లు తెలిసివచ్చెను.’

‘అతని వయసునుబట్టి — వర్తనమునుబట్టి ’

‘మొదటిదొక కారణము కాఁజాలదు. అతనినడత యెట్టిది ?’

‘అతఁడు నన్ను మోహదృష్టుల వీక్షించుచుండినను— అతనిమాటలందెట్టి దాక్షిణ్యమును, దైన్యమును దోచలేదు.’

‘పైన ?’

‘పైన — త్వరలోనే యాతఁడొక చిన్న యుత్తరము వ్రాసెను. దానిలో నాతఁడవివాహితుఁడైనట్లును — నన్ను ప్రథమమునఁ గనినక్షణమునుండియు నాకొఱకుఁ బ్రాణములఁ ద్యజింపసిద్ధముగ నున్నట్లును దెలియఁబఱచెను.

‘ఆ—హా ! అంతయు నాటకలక్షణముగా నున్నది !’

‘మీరీనడుమఁ జేసిన చర్యలకంటెనా ?’

రాధాయమ్మ మనసు చివుక్కుమనెను. కాని కుమార్తెకుఁ దన క్రోధముఁ గన్పట్టనీయక నిర్లక్ష్యముగా నామె ప్రసంగము సాగించెను.

‘తరువాతఁ జెప్పవైతివి ?’

‘పిమ్మట నేను రామరాజునకుఁ బ్రత్యుత్తరము వ్రాసి తోటగోడలోని తలుపుతాళపుచెవి నిచ్చితిని.’

'ఏమి ? మీరు తోటలో గలిసికొంటిరా ?'

'అవును—పెక్కుమారులు — కాని లేశమైన మరా హీలతో గంగాదని యొక్క నారినే చెప్పుచున్నాను.'

'చాల బాగుగ నున్నది !'

'మాయిద్దరి మనస్సులకు నచ్చియున్నది. జన్మలో నొకరి ప్రాణ మొకరుగ మేము మెలగదాటరాని శపథములఁ జేసికొంటిమి.'

'ఔనా !'

'ముమ్మాటికిని'

రాధాయమ్మ కనుబొమలు ముడుపులించెను. కర్కశస్వర ముతో నామె యిట్లనెను. ఈసంబంధమునకు నేనెప్పటికి నంగీక రించనని తెలిసికొనుము.'

'ఏల ?'

'రామరాజు స్థితిగతు లెట్టివి ?'

'మనవానికంటె మంచివే !'

'ఏవిధముగ ?'

'అన్ని విషయములలో'

'అనఁగా ?'

'రామరాజు ధనికుఁడు.'

'తల్లిదండ్రు లున్నారా ?'

'లేరు.'

'బంధువులు ?'

'నెల్లూరు ప్రాంత్యముల నున్నారట.'

'తా నిక్కడ నని యనుకున్నాఁడో ?'

'వస్త్రవహారకులచేత'

'వారి నైజ మెట్టిది ?'

'ఉపేక్షాహాస్యములు'

'అనఁగా నీకవి యాతఁడు చెప్పలేఁడని యర్థము.'

'అయిన ?'

'శ్రీముఖి ! ఇంకను తెలిసికొనఁజాలవా ?'

'ఏమని ?'

'రామరాజు నాటక సూత్రధారియని.'

'విశదముగాఁ జెప్పుము',

'అనఁగా నిన్నాతఁడు వంచనచేయుచున్నాఁడని.'

'నా యభిప్రాయము వేఱు.'

'కావచ్చును. కాని త్వరలోఁ దెలిసికొందువు.'

'ఏమిటో ?'

'ప్రియుని మోసము.'

'అమ్మా ! నీకీయనుమాన మక్కఱలేదు. వలసిన రామరాజు నిచ్చటికే రప్పింతును. నీమ్మాట నీవే యాతనితో సంభాషింపవచ్చును.'

'ఈపద్ధతి యుత్తమముగానున్నది' అని ఓంకారమనెను. 'రామరాజుతో మాటాడి తరువాతివిషయము చూచుకొనవచ్చును' అని జ్వాల వలపోసి చెప్పెను

'అయిన నట్లే కానిమ్ము.' రాధాయమ్మ శ్రీముఖతో ననియెను 'నీప్రియుని మాతో సంభాషింపనిమ్ము.'

'అభ్యంతరములేదు.'

వాకిటితలు పెవ్వరో స్ఫుటముగాఁ దట్టిరి.

'ఎవ్వరో!—పగటిచుక్క కాదుగద! అనుచు రాధాయమ్మ తెల్లబోవసాగెను.

'మేడపైకిఁ బొమ్ము.' ఓంకార ముపాయము చెప్పెను. 'అపాయములేనిచో నిన్ను బిలిచెదను, నిశ్శబ్దముగానుండుము'

'పగటిచుక్కయైన ?'

'నేను లేనా?'

'పొమ్ము, పొమ్ము' అని ఓంకారము తొందరచేసెను.

రాధాయమ్మ నిశ్శబ్దముగా జకచక మేడపైకి నిష్క్రమించెను. ఓంకార మేగి తలుపుతీసెను.

'ఎవ్వరచ్చుట?' అని యాతఁ డడిగెను.

"నేను" అని యొక యెఱిఁగిన కంఠస్వరము ప్రత్యుత్తర మిచ్చెను. మఱుక్షణములో పురుషోత్తమరావు లోని కేఁగుదెంచెను.

# పంచదశమ్మిదవ ప్రకరణము

## కర్మము.

పురుషోత్తమ ముఖమున గాంభీర్యమును, వెలవెలపాటును నచ్చోటుచేసికొనుచుండెను. ఓంకారము వానిని గమనించి యేవో విశేషములు జరిగినవని గ్రహించెను.

'మాణిక్యము మీరొద్దనున్నదా?' అని యాతండడిగెను.

నా కగ్గటలేదు' అని పురుషోత్తమరావు వినుగుతోఁ బ్రత్యుత్తర మిచ్చి యొక దూపనముఁ జేరెను.

'మఱి?'

'ఏమి?'

'జవ్వని యిప్పుడెచ్చట నున్నది?'

భగవంతుని కెఱుక!'

ఓంకారము వింతచెందెను.

'ఆమె మిమ్ముఁ బరిత్యజించి కనుదాటెనా?'

'చాల గడబిడ జరిగెను — రాధాయమ్మ యేది?'

జ్వాల చకచక మేడపైకేగి యజమానురాలిని బిలుచుకొనివచ్చెను. మందహాసముతోఁ బ్రవేశించిన రాధాయమ్మ యాగంతుకునివదనముఁ జూచి, తన ముఖమున గూడ గంభీరత నెలకొల్పెను.

'పురుషోత్తమరావుగారా?' అని యాతని సంబోధించుచు నామెయుఁ గూర్చుండెను.

'ఔను'

'మాణిక్య మెట్లున్నది?'

'పగవారికైనను వ్యభిచారబుద్ధి వలదు—వలదు.

రాధాయమ్మ మహాశ్చర్యము సూచించెను.

'ఈబరితాప మెట్లువచ్చె?' అని సగమెగతాళిగా నామె యాతని నడిగెను.

'పెద్దగోల జరిగినది—మాణిక్యము రెండుమారులు తప్పించుకొనినది నాకుఁ జావు తప్పి కన్ను లొట్టవోయెను.'

'మొదటిసారి జరిగినది తెలియును. మీరు గుండేరులో దుమికి—బాలికను రైలులో పంపితిరి.'

'అవును—నేను పెద్దమూఢుఁడను.'

'కాదా మరి! చేఁజిక్కిన నిధినిఁ బోగొట్టుకొను మందుఁడుందునా?'

'ఏమైననేమి? జరిగినది జరిగినది—'

'అవునండి. జరుగఁబోవునది జరుగగలదు. ప్రస్తుతమేమి?'

'పురుషోత్తమరావు గడ్డము తడివికొనుచు యోచింపఁ జొచ్చెను. అందఱు నిశ్శబ్దముగ నుండిరి. శ్రీముఖి జరుగుచున్న విషయ మంతయు మిక్కిలి జాగ్రత్తగా గమనించుచుండెను.

అందఱు పురుషోత్తమరావు వదనమునంకఁ జూచుచు నాతని మాటలు వినవేచియుండిరి. ఎట్టకేలకుఁ బురుషోత్తమరా విట్లనెను:

'మొదటిసారి నన్ను తప్పించుకొనిన మాణిక్యము తిరిగి నాకెట్లు లభించెనో తెలియునా?'

'తెలియును.' అని రాధాయమ్మ సమాధానము చెప్పెను.

'ఎట్లు?'

'నీసేవకుఁడగు ఆర్ముఖమును-ఈఓంకారమును నీకామెను దెచ్చి ఇచ్చిరి-కాదా!'

'ఓంకారమా! ఎట్లు?

ఓంకారము జరిగినసంగతి క్లుప్తముగాఁ దెలియజెప్పెను. పురుషోత్తమరావు మిక్కిలి వింతచెంది యిట్లనెను.

'ఆర్ముఖ మెంత టక్కరు!'

'ఆసంగతి యిప్పుడు తెలిసికొంటిరా?' అని ఓంకార మనెను.

'నీవు తనకు సాయముచేసినట్లు చెప్పనేలేదు సుమా!'

'ఎట్లు చెప్పును? అది యట్లుండనిండు. ఆపిల్ల మీయొద్ద నుండి మరల నెట్లు తప్పించుకొనెను?'

నా తెలివి తక్కువవల్ల.

'అది విశదమే. రాధాయమ్మ యనెను. కాని జరిగిన విధాన మెట్టిది?'

'ఆర్ముఖము నాకు గర్భశత్రుండాయెను.'

'మీరు వానికీయవలసిన పైకమీయనైతిరి. కాఁబోలు' అని ఓంకారము వెంటనే అడిగెను.

'అవును—ఈలేదు'

'వేయి రూపాయలు కాదా?'

'ఔను.'

'మీదే తప్పు.'

'ఎవరిదైననేమి?—కాని నీ కార్ముఖము సంగతి తెలియదు. ఆవేయి రూకలు ఇచ్చితి ననుకొనుము. ఒక్క పది దినములాగి నన్ను బెదరించుచు మరల పైకము కొఱకాతఁడు వచ్చును.'

'అయినను ఆర్ముఖమును నిందించవలసినది లేదు.'

'అవునా? పురుషోత్తమరావు వికటముగా నడిగెను. ఎట్లయ్యా?'

'మరల మీదే తప్పు.'

'అదే, ఎట్లు?'

ప్రక్కలో బల్లెమువలె మీగుట్టెఱింగినవానిని చేరఁ దీయరాదు.'

'నానీడవలె వాఁడు నన్ను విడువఁడే!'

'అట్లయిన మీక్షేమముకొఱకై కొంత సాహసము చూపిన బాగుగ నుండెడిది.

'వాఁడు లేఁడా! వానిని రివాల్వరుతో కాల్చితిని!'

'ఆ...దటు నాశ్చర్యము తెలిపిరి

'అదెట్లు జరిగెను?' అని ఓంకార మడిగెను.

పురుషోత్తమరావు దాసరపల్లిలో మిద్దెలో తాను ఆర్మ్మఖునను కాల్చి సలాయుసముచేయుట—తుకాజీ వెంట నంటుటవఱకుఁ జెప్పి యిట్లనెను.

'తుకాజీ గంజాయి మత్తుఁడు. వానినుండి నేను చీఁకటి లోఁ దప్పించుకొని ఒకపల్లెచేరి నాఁడటుఁ గడపితిని. తరువాత నింతవఱ కచ్చట నిచ్చటుఁ దిరిగి—పిచ్చియెత్తినట్లుండి—తుదకు గర్తపురమునకు వచ్చితిని. అయినను ఆర్మ్మఖుము నన్ను వదలఁడు!'

'అదేమి? రాధాయమ్మ తొందరగా నడిగెను. ఆర్మ్మ ఖుము చనిపోయియు నిన్ను సాధించునా?'

'వాఁడు చావలేదు! నాతుపాకిదెబ్బ సరిగా తగులలేదు

'ఏమి ?'

'ఏమా? నాకర్మము!'

'నిజముగా నంతే. కాని వాఁడు చావనట్లెట్లు తెలియును?

'నేఁటిరాత్రి ఇంతకుఁ బూర్వమే వానినిఁ జూచితిని.'

'ఆఁ! ఎక్కడ?'

'నేను దీపపుస్తంభము క్రీనీడలో దాగితిని. మృత్యు దేవతవలె ఆర్మ్మఖుము చుట్టుప్రక్కలఁ గలయజూచుచు ముందు నకు బోవుచుండెను.'

'ఎవరికొఱకు?'

'ఇంకెవరికొఱకు? గోపిం—పురుషోత్తమరావుకొఱకే!

మరల వాకిటి తలుపెవరో స్ఫుటముగాఁ దట్టినట్లు చప్పుడయ్యెను. రాధాయమ్మయుఁ బురుషోత్తమరావును వెల వెలఁ బోయిరి.

'పగటిచుక్కయేమో!' అని గృహయజమానురాలనెను.

'ఆర్యముఖము కాదుగద!' అని పురుషోత్తమరావు లేచెను.

'ఓంకారం! పోయి తలుపు తెఱువుము— అయ్యో! రమ్మ! రమ్మ! అనుచు నాత్రముగా రాధాయమ్మ మేడమెట్లెక్కి యదృశ్యయయ్యెను. పురుషోత్తమరావు నామె ననుసరించి యంతర్ధానమొందెను.

ఓంకారము పోయి తలుపు తెఱచెను. చిత్రాకారముతో పగటిచుక్క లోని కేగుదెంచెను.

---

## ఇరువదియవ ప్రకరణము

### అంత్యకాలము

ఓంకారము తెల్లబోయెను. ఆతనిగుండె దడదడలాడుచు స్వాధీనము తప్పిపోనట్లుండెను. తడఁబడుచు నాతఁడు పెదవులు విచ్చి యేమో యడుగబోయెను. కాని యాప్రశ్న వెలుపలికి

రాలేదు. తలుపుబంధించి పగటిచుక్క ముందున కడుగిడెను. అప్రయత్నముగ ఓంకారము ప్రక్కకు జరిగెను. ఆయాగంతుకుఁడు పెద్ద పెద్ద యడుగులతో జ్వాలయు, శ్రీముఖియుఁ గూర్చుండిన ప్రదేశమునుచేరెను అప్రయత్నముగనే— వణకుచున్న కాళ్ళతో—ఓంకార మచటికివచ్చెను. జ్వాల పగటిచుక్కనుజూచి కెవ్వున కేకవేసెను. కాని గుండెదిటవుగల శ్రీముఖి గంభీరవదనముతో నాతని వింతయాకృతిని గమనించెను.

వెనుక నొకమారు రాధాయమ్మకు దర్శన మిచ్చినప్పటివలెఁగాక యీమారు సుప్రసిద్ధుఁడగు నాచోరుఁడు వారికింకొకవిధముగాఁ గన్పట్టెను. అతఁడు ధరించిన వింతరంగుల దుస్తులపై నెడమవక్షముపైన నెఱ్ఱని యైదుకొమ్ముల నక్షత్రము విస్పష్టముగా నగపడుచుండెను. ఆతని 'ముఖమల్‌కోటు' పైన సొగసైన నక్కీపని దీపప్రకాశములోఁ దళతళలాడుచుండెను. భుజములనంటి వీపుమీఁదుగా క్రిందికొక సిలప్రుటులిపిరి పట్టుగుడ్డ రాజలక్షణముగా వ్రేలాడుచుండెను. ఉంగరము లుంగరములుగాఁ జుట్టుకొనిన యాతని సుందర కుంతలములపై నెట్టి శిరోవేష్టము సమర్పించబడియుండలేదు. వక్షముపైఁ జేతులుమడిచి గంభీరవదనముతో, నిశ్చలదృష్టిసహిత నేత్రములతో పగటిచుక్క జ్వాల నిట్లు సంబోధించెను.

'రాధాయమ్మ యెక్కడ?'

జ్వాల యాచోరనాయకునిచూపు సహింపఁజాలక తల వంచుకొనియే యిట్లు వణఁకుచుఁ బ్రత్యుత్తర మొసఁగెను.

'నాకుఁ దెలియదు.'

'తెలియదా? పగటిచుక్క గద్దించుచు మాటాడెను. తెలియదా? నిజముగా దెలియదేమి? ముమ్మాటికిని?—ఇటు చూడుము. నా పేరు పగటిచుక్క!'

జ్వాలదేహము, నఖశిఖపర్యంతమును గాలిలోఁ జిక్కిన మొండుటాకు తేలిపోవుచున్నట్లు తేలిపోవుచుండెను. ఏదో చెప్పఁబోయి, నురుగులు గ్రక్కుచు నామె స్పృహతప్పి క్రిందఁ బడెను. పగటిచుక్క వాడిచూపు ఆమె స్థైర్యమును భస్మీభూతముచేసెను.

మన స్థైర్యము చిక్కఁబట్టిన శ్రీముఖ తటాలున లేచి యాగంతుకుని నిశ్చల గంభీరదృష్టులతో వీక్షించుచు నిట్లనెను.

'మాఅమ్మతో నీకేమిపని?'

పగటిచుక్క యామెను తీవ్రముగాఁ దిలకించుచు నిట్లు సమాధానముచెప్పెను. అవును— పనియేమున్నది. ఆమె యెక్కడ?

'చెప్పవద్దు—వద్దు' అనినట్లుగా ఓంకారము పగటిచుక్క వెనుక వణఁకుచు నిలిచి శ్రీముఖకి కనుసంజ్ఞ చేసి చేతులు త్రిప్పెను. కాని యాజవ్వని యాతని ప్రయత్నముల గమనింప లేదు, ఆమె పై ప్రశ్నకిట్లు జవాబుచెప్పెను.

'పనియుండవచ్చును—దానినై జమెట్టిది?'

'నీకనవసరము.'

'మాయింటికి నీవు వచ్చుటయు మిక్కిలి యనవసరమే మాఅమ్మకు హానిచేయజూచుట యంతకంటె—'

'ఎవరితోఁ జెప్పుచుంటివి?' అనుచు పగటిచుక్క యొక యెఱ్ఱని బుడ్డితీసి తలవనితలంపుగా శ్రీముఖి నాసికాపుటముల చెంత నుంచెను. ఆమె యప్రయత్నముగ దానిని పీల్చెను, ఆమెకన్నులు క్రమముగా మూసికొనఁజొచ్చెను. నిలువఁజాలక కూలఁబడి యామె యొకక్షణకాలములోఁ దెలివితప్పెను.

వెంటనే పగటిచుక్క ఓంకారమువైపు తిరిగెను. గజగజ వణఁకుచు నాతఁడు పాచోళనాథుని పాదములపైఁ బ్రవాలి నన్ను నేను— అనుచు దడఁబడుచుఁ గన్నీరు గార్చఁజొచ్చెను.

'ఛీ చోటుండా! లెమ్ము, లెమ్ము' అని పగటిచుక్క కఠినముగా హెచ్చరించెను వెలవెలఁబోవుచున్న ముఖముతో—నిస్తేజములైన నేత్రములతో ఓంకారము లేచెను. పగటిచుక్క మరల కఠినముగా నిట్లనెను.

'ఓరీ! పిరికిపందా! నాప్రశ్నకు నిజమైన సమాధానము లేనిచో—భగవంతునితోడ—నీతల యెగురును!

'చె—చె—ప్పెదను' అనుచు బలవంతముగ ఓంకార ముచ్చరించెను. చెమటచే నాతని దుస్తులు తడిసిపోయెను.

'రాధాయమ్మ యెక్కడ?'

ఓంకారము మేడమెట్లవైపు చూచెను.

'ఎక్కడ నున్నది?'

'ఆ—మె—ట్లు—'

'మేడపై నున్నదా?'

'ఉ.'

'ఒక్కత్తెయు'

ఓంకారము తలగోకికొనుచు నేమో చెప్పఁబోయి మూలుగఁ దొడఁగెను.

'చెప్పుము. మేడపై నెవ్వరున్నారు?'

'పు—రు—' పై మాటరాలేదు.

'ఎవ్వరు?—పురుషోత్తమరావా?'

'ఔను—ను'

'అయిన నీవక్కడనే యుండుము. కదలిన జాగ్రత్త,' అనుచుఁ బగటిచుక్క నడివడిగను—నిశ్శబ్దముగను మేడ మెట్లెక్కి యంతర్ధానము నొందెను.

ఒక్క నిట్టూర్పు విడిచి, నెత్తి గోకికొనుచు—తలవంచి, ఓంకారము చతికిలఁబడెను. అతని కెట్లుండెనో కాని ఏమో మెల్లగా గొణుగుకొనుచు మా—నా—అంత్యకాలము—అంత్యకాలము!' అనుచు జపము చేయుచుండెను.

---

## ఇరువదియొకటవ ప్రకరణము

### పిడుగుపాటు

ఓంకారము పగటిచుక్కకుఁ దలుపుతీయకమునుపే రాధాయమ్మయు, నామె మడమలవెంటనే పురుషోత్తమరావును మేడమెట్లెక్కి యదృశ్యమైనట్లు వెనుక చెప్పియుంటిమి, మేడ

క్రిందఁ బగటిచుక్క సంభాషించుచు బెదరించుచున్న కాలమునఁ బైభాగమున నేమి జరుగుచుండెనో విశదీకరింపవలసి యున్నది

పరుగు పరుగునఁబోయి రాధాయమ్మ విశాలమగు నొకగది ప్రవేశించెను. పురుషోత్తమరావు నామె వెనువెంటనే గదిలోనికిఁజని తలుపుమూసెను. వెలవెలబోవుచున్న ముఖముతో రాధాయమ్మ "తలుపు—గడియ" అనెను. పురుషోత్తమరావు వెంటనే కవాటము లోన బంధించెను. యోచించుచు రాధాయమ్మ యొక కుర్చీలో నాసీనురాలాయెను. పురుషోత్తమరావు మాత్రమింకను నిలువఁబడియే యుండెను.

స్వల్పకాలమునుండి యజమానురాలు సహచరునితో నిట్లు ప్రసంగించెను.

'అయ్యా! కూర్చుండుఁడు—ఆకుర్చీపై.'

పురుషోత్తమరా వాసీనుఁడాయెను. ఆతని కుర్చీ నిలువుటద్దమున కెదురుగఁ గొంచెందూరమున నుండెను.

'పురుషోత్తమరావ్! పోయి వచ్చినదెవరో చూచి వచ్చెదవా?'

'ఎట్లు వీలగును?'

'వెలుపలికి వెళ్ళి మెట్లపైన నిలిచి క్రిందిసంభాషణ వినుము.'

'వినిన?'

'వచ్చిన దెవ్వరో తెలిదమగును.'

'నే నెవరి నెఱుంగుదును?'

'భయములేదు—సంభాషణనుబట్టి గ్రహించుకొనుము.'

'నీ వెందుకు వెళ్ళఁగూడదు?'

'వచ్చినవాఁడు పగటిచుక్కయైన నాకుఁ జావుతప్పదు'

'ఆర్ముఖుఁడైన—నాకుఁ దప్పదు.'

'నావలెనే నీకును భయమా?' అని యజమానురాలు ఎగతాళిగా నడిగెను.

'నీవలెనే అనఁగా?—'

'అనగా నేను స్త్రీని—నీవు పురుషుఁడవు.'

'నిజమే' పురుషోత్తమరావు శాంతముగాఁ బ్రత్యుత్తరమిచ్చెను. కాని నిష్కారణముగా పగటిచుక్క నిన్ను వేధించుచున్న, నెపముగల ఆర్ముఖుఁడు నన్ను వధింపఁజూడఁడా?'

'అయిన?'

'క్రిందవచ్చియున్నది పగటిచుక్కయైన నీకంతభయము లేదు. కాని ఆర్ముఖుఁడైన?'

రాధాయమ్మ వణుకుతో లేచెను. పురుషోత్తమరావు మాత్రము నిశ్చలుఁడై గంభీరముగా నట్టె కూర్చుండి యుండెను.

'అయిన నేను పోయి చూచి వచ్చెదను.' అనుచు రాధాయమ్మ తలుపును సమీపించి గడియతీసెను.

'నా అభ్యంతరములేదు.' అని పురుషోత్తమరావు చెప్పెను.

‘నీ సాన్నిధ్యమునకు నేను నోచియుండలేదు.’ అని యజ
మానురాలు నిర్లక్ష్యముగా జవాబిచ్చెను.

‘మరింత మేలు.’

‘అలుక కెంజాయలోన్నత్వము’ రాధాయమ్మ మరల సంకోచ
ముతో నాగెను.

‘నీవు నా మనసుని జన్మలోఁ దెలియలేవు. రమ్ము. రమ్ము
పిచ్చిపోకడలు పోకుము.’ అని పురుషోత్తమరావు హాస్యగంభీర
భావముతో ననెను

రాధాయమ్మ నవ్వుకొనుచు లోపలికివచ్చి పురుషోత్త
మరావునకును—నిలువుటద్దమునకు మధ్యనున్న యొకకుర్చీపై
నాసీనురాలాయెను. ఆమె వదన మాతనివైపును, వీపు దర్పణము
దెసను నుండెను. పురుషోత్తమరావునకు అద్దములోఁ దనముఖ
మును, రాధాయమ్మవీపును, శిరమువెనుకభాగమును విస్పష్ట
ముగా నగపడుచుండెను. రాబోవు విషయములు చక్కగా
గ్రహించుకొనుటకై చదువరు లీపైయంశముల బాగుగా
గమనింపవలెను.

ఉభయులును గొంతసేపు మౌనమువహించిరి, అంతట
రాధాయమ్మ మరల నిట్లు ప్రసంగమెత్తెను.

‘క్రిందయేమి జరుగుచున్నదో?’

‘ఎట్లు తెలియవచ్చును?’

‘ఎవరో వచ్చిరి—మనవిరోధులే.’

'అవును. లేనిచో నెవరో యొకరు వచ్చి మాతోఁ జెప్పి యుండరా ?'

'కాని పురుషోత్తమరావ్! అదృష్టము దైర్యముగా మా యింటికి — నీకొఱకు పన్నినవల పోసఁగెను.'

'మఱి ?'

'మఱి యేమున్నది ? వచ్చినవాఁడు పగటిచుక్క!'

'కావచ్చును.'

అయిన నీకేమి భయము ? నీవు పోయిచూచిరమ్ము.

రాధాయమ్మా! నీవు పొరఁబడుచున్నావు. మాణిక్యము నెత్తుకొని వచ్చినందులకే పగటిచుక్క నీపైన నింత పగఁబూని — ఆమెను జెఱుప యత్నించినందులకు నన్ను అతడేమి చేయఁడు ?

కాఁబట్టి నీవు క్రిందికిఁ బోవా ?

క్రిందకుఁ గాదు — వెలుపలికిఁ గూడఁ బోవను.

గృహయజమానురాలు నోటను మాటాడలేదు. పురుషోత్తమరావు నిలువుటద్దములోఁ జూచుచు, కదలక మెదలక యట్లే కూర్చుండెను. అచ్చట మిక్కిలి నిశ్శబ్దముగా నుండెను.

ఆకస్మికముగా పురుషోత్తమరావు 'ఇదేమి చిత్రము!' అనుచు కుర్చీలోనుండి సగము లేచెను

విస్మయముతో రాధాయమ్మ 'ఏమి' అని యడిగెను.

ప్రస్తుత మా యువకుడే పురుషోత్తమరావు నిలువబడ్డ ముఖపంకజ మదేకదీక్షను జూచుచుండెను.

'ఏమిటి?' అని గృహయజమానురాలు మరల వింతతో నడిగెను.

పురుషోత్తమరావు సరిగా గూర్చుండి రాధాయమ్మ వైపు తిరిగి, నీవెప్పుడైన మల్లాపురములో నుంటివా? — ఉండలేదా? అని యత్యాతురముగా నడిగి ప్రత్యుత్తరము కొఱకై యాత్రముగానే ఎదురుచూచుచుండెను.

కాని రాధాయమ్మ సమాధానము చెప్పలేదు. కత్తి నాటువేసిన నెత్తుటిచుక్క లేనట్లు లామెముఖము క్షణములోఁ బాలిపోయెను

ఏమి? నీవు మల్లాపురములో నుండలేదా? సుమారు పదునాల్గేండ్లక్రిందట? — ఉండలేదా?

ఉండియుందును — దానిలోఁ జిత్రమేమి? అనుచు రాధాయమ్మ బలవంతముగాఁ బెదవులు విప్పెను.

చిత్ర మేమి యనవా? చాల చిత్రమున్నది! నీయప్పటి పేరు అలికుంతల కాదా?

రాధాయమ్మ మఱింత పాలిపోయినట్లయ్యెను.

'ఈ — ఈ — ప్ర — శ్న — లెం — దు — కు?' అని యామె వినఁబడీ వినఁబడనట్లుగా నడిగెను.

నేను నిన్ను గుర్తించితిని! అనుచు పురుషోత్తమరావు లేచి యామెను సమీపించెను.

నీయభిప్రాయమేమి ? అనుచుఁ గళలేని నేత్రములతో రాధాయమ్మ కూడ లేచెను.

నాయభిప్రాయమా ? పురుషోత్తమరావు గంభీరముగా ననెను. పదునాలేండ్ల క్రిందట మల్లాపురములో నీవు అలికినంత లవు—నేను నీప్రియునను ! పదునైదు తియ్యని రాత్రులు— అయిదునూర్ల రూకలు—జ్ఞప్తియందున్నవా ? ఇప్పటికై ననుఁ దెలిసినదే ?

రాధాయమ్మ నిర్ఘాంతపోయి వెనుకకుఁ గుర్చీలోఁ బడెను. పురుషోత్తమరావామెనుఁ బట్టుకొనఁబోయెను. కాని యామె యాతని వారించుచు నిట్లనెను.

నీ—వు—నన్నెట్లు—గుర్తించితివి ?

అద్దములో నీవీపు—మెడకన్పట్టుటచేత.

అనఁగా ?

'నీమెడపైనఁ జిన్ననాఁట గాయమై' మాని పొడుగగు నన్నని మచ్చయేర్పడినట్లు వెనుక నాతోఁ జెప్పితివి. అది ఆ మచ్చప్రక్కన రెండు పెద్ద పుట్టుమచ్చ లుండెను ఆవిషయము నాకు బాగుగా జ్ఞాపకమున్నది. నేఁడు తలవనితలంపుగనే నీ చిహ్నముల నిప్పు డద్దములో నీమెడపైఁ జూచితిని.

స్తంభితురాలై వినుచున్న రాధాయమ్మ చలించలేదు. ఆమెదృష్టియు జలింపలేదు. ప్రతిమయైన నంతనిశ్చలముగా నుండఁజాలదు.

నాకాన్పు నేమిచేసితివి? అని యాకస్మికముగా పురుషోత్తమరావామెను ప్రశ్నించెను.

నేను గర్భము ధరించితినని నీకెట్లెఱుక? పదునైదు దినములేగదా నీవు నాతో నుండినది? పిమ్మట వింతగా నంతర్ధానమైతివి. నాఁటికి నేఁటికి నీవా పురుషుఁడవని తెలియుచున్నది.

నేను పిమ్మట విచారించితిని. నీవు గర్భిణివై యున్నట్లు వింటిని చపలచిత్తుఁడనగుట మరల నీకు దర్శనమీయలేదు. కాని—ఆశిశు వేమాయెను?

ఇఁక దాచనేటికి? రాధాయమ్మ చెప్పెను. ఆశిశువు నొక బీదవానియింటనుంచి నేను పలాయనము చేసితిని.

బీదవానియింటనా? పేరు?

వామనరావు.

భార్య యుండెనా?

ఉండెను.

పేరు?

కుసుమమ్మ.

వామనరావు?—కుసుమమ్మ?— వారిప్పు డెక్కడ నున్నారు?

తరువాత సంవత్సరముననే వారు మల్లాపురము విడిచి రిటు— మీఁది వృత్తాంతము నాకుఁ దెలియదు.

ఈ పదునైదు సంవత్సరములనుండి వారిజాక్షి లేదా? లేశమును.

తలుపకస్మాత్తుగఁ దెఱచికొనెను. రాధాయమ్మ తలుపుగడెయ దీసినప్పుడు మరల వేయుట మఱచెను.

పగటిచుక్క లోనఁ బ్రవేశించెను.

రక్షింపుము—రక్షింపుము! అనుచు కెవ్వున నార్చి రాధాయమ్మ పురుషోత్తమరావును గౌఁగిలించెను.

దురదృష్టవంతురాలా! పగటిచుక్క దీనముగాఁ జెప్పెను. నిన్నా పరమేశ్వరుఁడే సంరక్షింపవలెను—ఓగీ! పాపకర్ముఁడా! గోవిందపంతులు; నీవు తలపెట్టిన ద్రోహము చెప్పరానిది—కననిది—విననిది!

పగటిచుక్క యాఁగెను. వారుభయులును వెల్లబోయి చూచుచుండిరి. యాగంతుకుఁడు మరల నిట్లనెను.

దైవఘటన యిట్లున్నది మీరు కనిన పసిపిల్ల యెవ్వరనుకొనుచున్నారు? ఓ అలికుంతలా! నీవు వామనరావుగారి కప్పజెప్పినపిల్ల యెవరో తెలియునా? గోవిందపంతులు! నీవు ఉంపుడుకత్తెగా కోసిన సుందరి యెవ్వతెయో తెలియునా?—ఆమెయే మీకూఁతురు ఆమెయే మాణిక్యము!

భగవంతుఁడా! అనుచు గోవిందపంతులు రాధాయమ్మను విడిచి చతికిలఁబడెను రాధాయమ్మ స్మృతితప్పి నేలమీఁద వ్రాలెను.

పగటిచుక్క నిశ్చలముగా నిలిచియుండెను.

---

## ఇరువదిరెండవ ప్రకరణము

### చిత్ర దాంపత్య ఫలము

స్వల్పకాలములోనే రాధాయమ్మ కన్నులం విచ్చెను. ఆమె మేధక్షేత్రముపై నిట్టి దారుణమైన పిడుగు పడినతరువాత నది కొంతసేపటివఱకుఁ గోలుకొనలేదు. తెలిసి దెలియని చూపుతో నామెగదిలోఁ జుట్టును జూచెను. పగటిచుక్క గంభీరముగాఁ గూర్చుండి యుండెను. పురుషోత్తమరావు చేతులలోఁ దలపెట్టుకొని పాలినముఖముతో నాతిని నరననే యాసీనుఁడై యుండెను—తానిప్పుడెచ్చటనున్నది ? తానొక సోఫాపైఁ బరుండెను. అచటికెట్లు తాను వచ్చెనో యామె కగోచరముగా నుండెను.

అలికంతల లేచినది పగటిచుక్క యనుచుండెను. ఆమెను గూర్చుండఁజేయు—మాటాడవలెను.

'చిత్రము' అని పురుషోత్తమరావు దీనముగా సమాధానముచెప్పి యామెవైపు తిరిగెను.

రాధాయమ్మ తనంతటతానే లేచికూర్చుండెను.

'లేచినది' అని పురుషోత్తమరా వనెను.

పగటిచుక్క యామెను తీవ్రముగాఁ దిలకించుచు నిట్లడిగెను. ఓ దురదృష్టవంతురాలా ! నీవు నీకన్నకడుపు నెడల

దలపెట్టిన ద్రోహబలిమి యిప్పటికైనను సంపూర్ణముగా గ్రహించితివా ?

నాకు—నాకు—ఎఱుక లేదు. ఇందునకు పరమేశ్వరుఁడే సాక్షి ! అని యామె పశ్చాత్తాపముతోఁ బ్రత్యుత్తర మిచ్చెను.

అవుననుకొనుము. అయినను నీమర్త్యవృత్తికి భగవంతుఁడు నిన్ను తగినరీతిగా శిక్షించెను ! నీవు సుందరుల నెత్తికొనివచ్చి బానిసలుగా నమ్ముచుంటివి—ధర్మస్వరూపుఁ డగు ఈశ్వరుఁడు తుదకు నీకన్నకూతునే నీచే నట్లు క్రయింపఁ జేసెను. మీఁదు మిక్కిలి—ఎవరికి ? పిల్లకన్న తండ్రికి !—దేనికి ? తన ఉంపుడు కత్తెగా నుంచుకొనుటకు ! ఎంత దుశ్చరితము ! ఎంత అన్యాయము ! ఎంత అమానుషము !

ఈశ్వరా ! నన్నీ క్షణమున నిలువున దహించివేయుము ! అనుచు పురుషోత్తమరావు వలవల నేడువఁదొడఁగెను.

బొందితో నన్నీ పట్టున నరకకూపమున భగవంతుఁడు దిగఁద్రొక్కిన నాతనికి వందనము లర్పించెదను. అని రాధాయమ్మ వికృత కంఠస్వరముతోఁ జెప్పెను.

పగటిచుక్క. మరల గంభీరముగా నిట్లనెను. 'మీకున్న ఒక్క క్షమాపణము నేమన మీరీఘోరకృత్యముల నజ్ఞానులై చేసితిరి. లేశము తెలిసినను నాప్రకారమొనర్చియుండరు.

'జన్మలో' అని పురుషోత్తమరావు దృఢముగా వచించెను.

'కంఠమునఁ బ్రాణము లుండగ—' అనుచు రాధా

యమ్మ స్పష్టముగా నుచ్చరించెను. ఆమెకుఁ గొంచెముగ ధైర్య
ముతిరిగి వచ్చెను.

మరియొక సంగతి పగటిచుక్క శాంతముగాఁ జెప్పెను.
'మాణిక్యము నాకత్తురాలయిన భార్యయని తెలిసికొనుఁడు.

పురుషోత్తమరావు వింతచెందెను. తాను పగటిచుక్క మనోహారియెడలఁ జేయఁదలంచిన ద్రోహమును— దాని పర్యవసానఫలమును నూహించుకొని యాతడా పాదమస్తకమును వణఁకెను.

కాని రాధాయమ్మ యిదివఱకే మాణిక్యము పగటిచుక్క ప్రియురాలై యుండవలెనని యూహించి యుండెను. ఆజవ్వనిని విక్రయించినందులకు పగటిచుక్క తనను బెట్టినకష్టములే దీనికిఁ గారణము. 'నేనింతమాత్ర మూహించితిని— ఆబాలికను విక్రయించిన సిమ్మట నీచేతఁ జిక్కినప్పుడు' అని యామె మెల్లగా ననెను.

'అవును' పగటిచుక్క సమాధానము చెప్పెను. 'నాచేత జిక్కినప్పుడు నీవు మహాపదలో నుంటివి అది యట్లుండ లక్ష్మీపురములోని బవసరాజే వామనరావనియెఱుఁగుదు. ఆతఁడు నామముమార్చి తిరుగుచున్నాఁడు.'

అందువలననే యింతయనర్థము సంభవించెను! అని రాధాయమ్మ వినుగులతోఁ బలికెను 'అదియుఁగాక పిల్లపేరు నాచేఁ బెట్టఁబడినది కాదు.

నీవు వామనరావుగారియింట కాగితమునుంచి పోతివి. దానిపై "అ" అని సంతకముండెను. "అ" అన అలికుంతల యని నీయభిప్రాయము కాదా!

నిస్సందేహముగ నని ప్రత్యుత్తర మిచ్చెను. కాని యామె కంఠస్వరము వణఁకుట స్పష్టమాయెను.

మంచిది—నేటికి చిత్రములు విచ్చిపోయినవి— మీ చిత్ర దాంపత్యఫలము వెలువడినది— సంగతులు విశదీకరింపఁబడినవి.

కుసుమయ్యగారు లక్ష్మీపురములో నున్నదా? అని రాధాయమ్మ కొలఁది కాలముండి యడిగెను.

లేదు.

ఏమి? ఆమె యిప్పుడెచట నున్నది?

చచ్చి స్వర్గమున

పాపము! ఆపుణ్యాత్మురాలు గతించినదా!

అవును.

రాధాయమ్మ విచారించెను. కుసుమమ్మ గుణములఁ బొగడఁజొచ్చెను. పగటిచుక్క యామెకడ్డమువచ్చి యిట్లనెను.

ఆసంగతి పిమ్మట మాటాడవచ్చును ప్రస్తుతము మీతో కొన్ని విషయములు సంభాషింపవలెను. నే చెప్పుదానిని శ్రద్ధగా వినుఁడు—బసవరాజని పేరుపెట్టుకొని వామనరావు మల్హాపురము— తరువాత నెల్లూరు విడుచుట మొదలైనవి మీకుఁ దెలుపవలసియున్నది.

మేము సిద్ధముగా నున్నారము అని యిరువురు నైకకంఠ్యముగా వ్రాకుచ్చిరి.

పగటిచుక్క గంభీరముగా తాను జెప్పఁదలచుకొనిన విషయ మారంభించెను.

---

## ఇరువదిమూడవ ప్రకరణము

---

### గోవిందపంతులు

చెప్పినవిషయములే మరల మరలఁ జెప్పుచుఁ జదువరులకు విసుగు గలిగించుట మాయుద్దేశము కాదు జస్వంతరావను పేరఁ దన్నికముందుఁ బిలుచుచుండవలెనని పగటిచుక్క వారితోఁ జెప్పెను. ఆతఁడు వారికిఁ దెలిసినవిషయములలో ముఖ్యమైన వేవియన బసవరాడను పేరుతో వామనరావు మల్లాపురము విడిచి నెల్లూరు చేరుట—అక్కడఁ బదేండ్లున్నతరువాత కుసుమమ్మగారు మృతినొందుట— ఆసమయమున పగటిచుక్క మాణిక్యమునుజూచి ప్రేమించుట— వారితో పరిచయము— తరువాత వారిని గొలఁది కాలమునకు లక్ష్మీపురము జేర్చుట— ఈసంగతిఁ జెప్పుచుఁ బగటిచుక్క యిట్లనెను.

నాకు వామనరావుతోఁ బరిచయమైన సమయముననే సరిగా మధుసూదనరావుగారి కొక దాసి కావలసివచ్చెను. ఇది

సుమారు మూఁడేండ్లక్రిందటిసంగతి, కొన్నికొన్ని కారణములచే నేనును, నాసహచరుఁడును మధుసూదనరావుగారిని సంశయించుచు నాయనపైఁ గాపుంటిమి. అందుచే నానాప్రయత్నములకు వీలుగ నాతల్లినే వారిదగ్గర దాసిగా నుండునట్లు నదుపాయ మొనర్చితిని తరువాతఁ గొలఁదికాలమునకే మధుసూదనరావు గారి కెవ్వరినైనఁ బెంచుకొనవలెనని బుద్ధి జనించెను. దానిపై నేను నాతల్లితో యోజించి సుగుణముల కుప్పయగు మాణిక్యము నాతనికిఁ జూపితిమి. చూచిన క్షణమునుండియు, ఆయన కాజవ్వనినిఁ బెంచుకొనఁ బెద్దకోర్కె పుట్టెను.

తరువాత నేను వామనరావును దెచ్చి, యాయనస్థితిగతులు మధుసూదనరావుగారితోఁ జెప్పి, మాణిక్యము జనన రహస్యము తెలిపి, నేనాసుందరిని వివాహమాడ నెంచినట్లు మొఱఁగించితిని. నేనొక ధనికుఁడననియు, మాది దక్షిణాది యనియు నదివఱకే ఆయనతో వచించితిని. అన్నిటికిని మధుసూదనరావుగారు సంతోషముతో సమ్మతించెను. ఆయన మిక్కిలి ధనికుఁడు. ఈ మూఁడుసంవత్సరముల నుండియుఁ దల్లియుఁ దండ్రియుఁ, దానై యాతఁడల్లారుముద్దుగా మాణిక్యమును బెంచుచున్నాఁడు నేనును నావ్యవహారములు చక్కబెట్టుకొను నడుమ నడుమ లక్ష్మీపురమునకు వెడలి వారి నెల్లరఁ జూచి పోవుచుంటిని. సుమా రెనిమిది నెలలక్రిందటివఱకు స్థితిగతు లిట్లుండెను అప్పుడు మాణిక్యమును ఓంకార మెత్తుకొనివచ్చెను.’

తరువాత, కొంతకాలము రాధాయమ్మనుజీవాట్లుపెట్టి యామెను నిజవృత్తి విడుచునట్లొప్పించి పగటిచుక్క, యిట్లనెను.

ఇక్కడ నాకుఁ గొన్నిపనులున్నవి. అవియైనవెంటనే నిన్ను లక్ష్మీపురము తీసికొనివెళ్ళి నీకూఁతును జూపెదను

నేను సిద్ధము—ప్రతిక్షణమును అని రాధాయమ్మ వాక్రుచ్చెను.

నీవు, ఓంకారమును—అనసతల్లిని మఱచివేయవలెను.

వారెక్కడకు వెళ్ళుదురు?

కొంతసొమ్మిచ్చిఉద్వాసనచెప్పుదును. వారినిఁక జన్మలో జూడకుండఁజేయుము, సరే శ్రీముఖియో ?

ఆమెను నీవెంటఁదెమ్ము. ఇప్పుడామె నామఱదలైనది— రామరా జెవ్వరో తెలియునా?

నీవు రామరాజు నెఱుఁగుదువా ?

కేవల మెఱుఁగుటమాత్రమేనా? ఆతఁడెవ్వరనుకొనుచున్నావు ?

నాకెట్లు తెలియును ? ఎవ్వరు ?

నాప్రాణములో సగము—నాకుడిచేయి.

రాధాయమ్మ యాశ్చర్యము చెందుచు, అయినఁ జిత్రమే అప్రయత్నముగ మీరిరువురు అక్కచెల్లెండ్రఁ బెండ్లియాడుట సంభవించినది ! అనెను.

అవును—చిత్రమే సరి, నీవింకఁ గ్రిందికి వెళ్ళి, యుక్తమని తోఁచినంతవఱకు నీవారితో సంగతులు తెలుపుము.

రాధాయమ్మ మేడపైకి బరువై తటతటలాడుచున్న హృదయముతో వచ్చెను. కాని, యిప్పుడామె చింతదీరిన మనసుతో, కలకదేఱిన ముఖముతోఁ గ్రిందికేగెను. ఆమె వెడలినతరువాత పగటిచుక్క గోవిందపంతులుతో నిట్లనెను.

గోవిందపంతులు! నీవు నాకొకవిధముగ నపకారము చేయలేదు. అనేక సందర్భములనీవు నాఘోరశత్రుఁడవు! నిన్ను క్షమింపలేను.

అజ్ఞానుఁడను—నన్ను రక్షింపుము అనుచు బాష్పములతో గోవిందపంతులు పగటిచుక్క పాదములపై వ్రాలెను.

ఓభీరుఁడా! లెమ్ము లెమ్ము. నీవు కన్నపుదొంగయగు జనార్దనరావు కొనర్చినసాయమంతయు నాకంత విషముపోసినట్లే. అయినను జనార్దనరావు నీదగ్గర చుట్టమగుట నీకొక క్షమాపణ.

నేను పెద్దలుబ్ధుఁడను—నన్ను నఱకిననుఁ బాపములేదు!

తరువాత—నీవు మాణిక్యమువిషయమై తల పెట్టిన ద్రోహము!

నన్ను వేఱే చంపనక్కఱలేదు!

నీ వేదుర్గతికిఁ బోవుదువో భగవంతుని కెఱుక!

ఎంతశిక్షయైనను నాకుఁ దగును, కాని—కాని—

ఏమి ?

నీకుఁ గోపమువచ్చునేమో !

భయములేదు—చెప్పుము.

నన్ను లక్ష్మీపురము తీసికొనివెళ్ళెదా ?

నిన్నా ?

అవును.

దేనికి?

నాకన్నకూఁతు పాదముల వ్రాలుటకు—ఇది మొదటిది.

రెండవది ?

నన్ను ఆత్మసుఖము కత్తినుండి తప్పించుటకు.

ఆత్మసుఖము నేఁటిరాత్రి నిన్ను వెంబడించెనా ?

నిశ్చయముగా.

పగటిచుక్క యోజించెను.

నాక్షమాపణ చెప్పుకొనుటకు—నాకూఁతురు సన్నిధానమున నుండుటకు నన్ను నీవు లక్ష్మీపురము తీసికొని వెడల కుండిన—

పిచ్చివాఁడా ! ఇట్టిగర్భశత్రుని నిన్నెట్లు రక్షించెదను ?

పోనిమ్ము—నీపాదమనైతిని, చేతిమీఁదుగ వధింపుము.

పగటిచుక్క ఆలోచించుచు నిట్లనెను. నిన్ను—రక్షించెదను. నాహృదయము పూర్వకముగగాదు. నాకొఱకుగాదు. కేవలము సద్గుణరాశియగుమాణిక్యముకొఱకు !

ఆరుమ్ముఖము నన్ను నీడవలె వెన్నాడుచునే యుండును. నాగుట్టంతయు వానికి బూర్ణముగాఁ దెలియును. వాడు జీవించి యుండిన నాకు క్షేమము గలుగదు.

చూచెదను. వానికిక భూమిపై విస్తారము దినము లుండవు—హంతలు హంతలను వధింతురుగాక !

తథాస్తు

నేను మరలఁ జెప్పువఱకు నీవు రాధాయమ్మయింటనే ఉండుము. ప్రస్తుతము నేను వెడలుచున్నాను.

పోయి రమ్ము.

పగటిచుక్క త్రుటిలో మేడక్రింద కేగి యటనుండి నిష్క్ర మించెను.

---

## ఇరువదినాలుగవ ప్రకరణము

---

### వినాళికాలము.

మాయాచిత్రచరిత్ర యించుమించుగా పమాప్తమునకు వచ్చుచున్నది. పగటిచుక్కయు, మాణిక్యము నీరెండవభాగ మునందలి కథ యింతవనుక దమలో భాగించుకొనినారు ఆ కారణమున మేము బొత్తిగా కొందఱుపాత్రల విషయ మెత్తు టయే సంభవింపలేదు. కాని యింతట నుపేక్షమాని శ్రీధరరా వును, చంద్రము నెట్లున్నారో చెప్పవలసియున్నది.

శ్యాకీపేటలోని యొకమాఱుమూలనందులో నొక చిన్నపెంకుటిల్లంతయు శ్రీధరరావద్దకుఁ దీసికొనినట్లు వెనుకఁ జెప్పియుంటిమి. ఇంతవఱకు నాతఁడచ్చటనే యుండెను పై ప్రకరణమందలి సంగతులు జరిగిన మఱునాఁటి యర్ధరాత్రమున శ్రీధరరావు పెంకుటింటిచావడిలోఁ జాపపై గూర్చుండి చంద్రముతో గంభీరముగాఁ బ్రసంగించుచుండెను. చంద్రమాతని సమీపమున నాసీనయై యుండెను. వారిర్వురియందు నీకొలది దినములలో నెట్టిమార్పును జరుగలేదు. చంద్రము మఱింత మనోహరముగ నుండెను. శ్రీధరుఁడు మఱింత గంభీరముగ నుండెను.

శ్రీధరుఁడు పెడమొగముపెట్టి యాసుందరితో నిట్లను చుండెను.

అయిన నేమందువు ?

ఏమనుట కేమున్నది? నీవు నన్నాదరించుటలేదు.

అగునా ?

ముమ్మాటికిని.

మంచిది. చంద్రం! మనకు వాదన అవసరములేదు.

పోనిమ్ము.

అయినను—నేను నిన్నల్లాదరించుటలేదు.

చెప్పుదువా ?

చెప్పవలెనని యే నామనవి.

శ్రీధరా! నీమనవియా? మనవి? ఆజ్ఞ యనరాదా?

అట్లే యనుకొనుము. చెప్పుము.

చంద్రము ఆతని శాంతముగా వీక్షించెను. కాని యాతఁడు మొగమామైనఁ ద్రిప్పలేదు. విసుగుతో నాతరుణి యిట్లనెను.

అనాదరణ వేఱుకావలయునా? ఇది కాదా?

ఏది?

నాతో పెడమొగముపెట్టి మాటాడుట.

ఒకటి—రెండవది?

నన్ను ప్రేమతో దగ్గర తీయకుండుట.

రెండు—మూడవది?

నే ననుకొనినట్లు ప్రవర్తించకుండుట

అది యెట్లు?

నీవు నాభర్తగ మెలగుచుంటివా?

నేను నీభర్తనైన గదా?

చంద్రము మాఱుపలుకలేదు. కొంతసేపుండి శ్రీధరరావిట్లనెను.

చంద్రం! పిచ్చిచంద్రం! మోహమునకు ముందు సంవత్సరములకొలఁది ఆయుస్సున్నది. పగకో—పగకు కొద్ది గంటలు మాత్రము—కొన్ని నిముషములు మాత్రమే జీవమున్నది. తెలిసినదా?

తెలిసినది.

నీవు భార్యవు—నేను భర్తను, కాకపోము. అయినట్లే యెంచుకొనుము. అయియే యుంటిమి. గ్రహించుకొంటివా?

లేదు.

తరువాత విశదీకరించెదను. ప్రస్తుతపుసంగతి వినుము.

ఏమి?

సింహాచలమును సంహరింపవలెనని నాప్రతిన—చెల్లు కాలము వచ్చినదిసుమా.

నీయభిప్రాయము?

రేపురాత్రి నేనో—పగటిచుక్కయో—ఒకరి వినాశ కాలము వచ్చినది.

తప్పక?

తప్పదు.

నీయాకస్మిక యుపాయము నాకుఁ గూడఁ జెప్పెదవా?

స్త్రీదగ్గఱ రహస్యము దాగదు. అయినను వినుము. నేడు నాకు పురుషోత్తమరావనువానితో స్నేహమయ్యెను.

అతఁడెవ్వడు?

మనయిరువురికేనిఁ గొత్తవాఁడు అతనికిని, పగటిచుక్కకును గర్భశత్రుత్వము. అదియు—మాణిక్య మనునొక స్త్రీమూలమున.

మాణిక్యమా!

అపుడు నీవా మెసంగతి వినియే యుంటివిగదా! సింహా
చలమా మెను తన యుంపుడుకత్తెగఁజేసి నీపవితినిఁ జేయఁజూచు
చున్నాడు ఎవరే 'యాచకో యాచకః శత్రుః'

అయిన యీపురుషోత్తమరావునకు పగటిచుక్క దర్శన
మిచ్చి, శేషరాత్రి ఎనిమిది మొదలుకొని, పన్నెండు గంటల
లోపుగ నాతని సంతృప్తిగాఁ బట్టుపట్టినట్లు ప్రతిన చేసెనఁట.

అయిన?

ఇంకను గ్రహింపుకొనలేవా?

ఏమి? నాకగోచరముగా నున్నది.

నేను శేషా పురుషోత్తమరావు వేషముధరించి, యీ
కత్తితో సింహాచలము అంతము కనఁగొనెను.

పురుషోత్తమరావుబస?

మన మెఱుఁగుదుము—రాధాయమ్మ మేడపై.

ఎందువల్ల?

పిల్లనమ్మిన రాధాయమ్మ యీకష్టసమయమున పురు
షోత్తమరావున కాశ్రయ మిచ్చెను.

పగటిచుక్కను ధిక్కరించి?

అది నాకుఁ దెలియదు.

అన్నియు సరిగానే యున్నవి. పురుషోత్తమరావు నిన్నె
ల్లెఱుఁగుదును?

అతఁడును సింహాచలమును నావలెనే కొన్నిమార్లు లను సరించెనఁట. ఒకమారు సింహాచలము, రామరాజు సంభాషించుకొనుటలో నా సంగతి, పేరు— ఊరికి పురుషోత్తమరావునకుఁ దెలియవచ్చెనఁట.

సరి— రేపు నీనడతయేమి?

రేపురాత్రి యెనిమిదిగంటలనుండి— చంద్రుఁడుండు గంటలలోపుగ రాధాయమ్మ మేడపై పురుషోత్తమరావు వేషము నందును.

సరి నీయిష్టము.

పురుషోత్తమరావుకు నీవు కృతజ్ఞురాలవై యుండవలెను.

దేనికి?

మనకు సాయముచేసి— నీకు సవతినిలేకుండ చేసినందులకు!

ఈమహాప్రయత్నము లో నెవ్వరు గెల్తురో?

జయాపజయములు దైవాధీనంబు లందురు.

అందులో మనకుఁ బ్రతికూలమైనఁ శ్రీధరా! నాగతియేమి?

చంద్రం! పైన భగవంతుఁ డున్నాఁడు. అదియటుండ— రేపు నేనుపోవుటకు ముందునీసంగతి తేల్చిపోయెదను.

అనగా?

రేపు— రేపు— పరుండుము.

శ్రీధరరావిక మాటాడలేదు. మరల దీర్ఘముగా యోజించుచు నాతడు చాలసేపటినుండి తీసిన చురకత్తి పదనును శాంతముగాఁ బరిశీలించుచుండెను.

---

## ఇరువదియొగవ ప్రకరణము

---

### రాజు, మంత్రి

'వినాశకాలే విపరీతబుద్ధిః' అనుట యెంతయు నిజమై యున్నది. శ్రీధరరావునకుఁ బోఁగాల మాసన్నమయ్యెను. అందువలన నాతనికి విపరీతాలోచన లుద్భవించెను కాని యంతయుఁ గేవల మాతని యాధీనములో లేదు. ఆతఁడు పురుషోత్తమరావు వలలోఁబడిపోయెను. పురుషోత్తమరావు పగటిచుక్క గర్భశత్రువని నమ్మెను. దానికిఁ గారణము మాణిక్యమునుగూర్చిన వివాదమే. ఆతఁడు రాధాయమ్మ మేడలో బసచేయుట కూడ సహజముగనే గన్పట్టెను. ఏలయనఁ దనకు జవ్వని నమ్మిన దాపెకదా ? పగటిచుక్క యూతనిఁ జంపనెంచుట యూ మిక్కిలి స్వాభావికముగనే తోఁచెను.

పగటిచుక్క రాజు, రామరాజుమంత్రి ఈయుపాయము వారిర్వురును గలిసి పన్నిరి. ఈపన్నుగడ సగముమాత్రమే మిగిలిన సగమింకను జరుపవలసియున్నది. పగటి

చుక్క గోవిందపంతులుతో, హంతలు హంతలను వధింతురు గాక! అనెను. ఆమాట నాతఁడూరకయనలేదు. ప్రస్తుతము తమ పక్షమువారిలో నిద్దరిని అసంగాఁ దనను, గోవిందం పంతులునుఁ జంపుటకై యిద్దరు హంతకులు వేచియుండిరని యాతనికి బాగుగాఁ దెలియునుగదా! ఇద్దరు హంతకులును నగరపురములోనే యుండిరి. పగటిచుక్క తనమంత్రితో దీర్ఘముగా యోజించెను. దాని పర్యవసానమే మన—'హంతలు హంతలను వధింతురుగాక!'—శ్రీధరరావు, బిర్మ్యఖాను నొకరి నొకరు చంపవలెను. ఆచిత్రపు వన్నెగడలోని విశేషములు మేమిఁక్రింద విశదీకరించుచున్నారము.

పగటిచుక్క రాధాయమ్మ మేడపై గోవిందంపంతులుతో సంభాషించిన మఱునాఁడే—ఉదయము పదిగంటల కాలమందు రామరాజుతోఁ గలిసి రహస్యముగ రాధాయమ్మ మేడఁ బ్రవేశించెను. అచ్చట రాజును, మంత్రియు, గోవిందం పంతులును మేడపైఁజేరి ముచ్చటించుకొనిరి. అమాత్యుఁడును నృపుఁడును బన్నిన యుపాయ మామూలాగ్రము గోవిందం పంతులున కెఱిఁగింపఁబడెను. మొట్టమొదట నాతఁడు దానిని నమ్మలేదు. అది జరుగునని యాతనికి ధైర్యములేదు. ఆవన్నెగడ చెప్పరాని విపరీతముగ నుండెను. కాని పగటిచుక్క, అచిరకాలముననే యాతని యనుమానములన్నియు దీర్చి, యాతఁడు మెలఁగవలసినపద్ధతి సంపూర్ణముగఁ గఱపెను.

గోవిందపంతులు చెప్పెను. ఆపన్నుగడ ప్రచండమైనదని గ్రహించెను. దానిప్రకారము జరుగుననికూడ తెలిసికొనం జొచ్చెను. పగటిచుక్క యెంత యుపాయప్రజ్ఞావంతుఁడో తెలిసికొని యాతఁడు నఖశిఖపర్యంతము వడఁకెను.

ఆ ప్రచండోపాయ మిది.

నాఁటిసాయంసమయములోపుగ గోవిందపంతులు శ్రీధరరావు పెంకటింటికి వెళ్ళవలెను—లేక వేరువిధముగానైన నాతని దర్శింపవలెను, తనపేరు పురుషోత్తమరావని చెప్పవలెను. తాను శ్రీధరుని, ఆతని యుద్యమము నెఱిఁగినట్లు నటించవలెను. ఎట్లెఱుఁగునని శ్రీధరుఁడడిగిన, పగటిచుక్క ననేకమారు లనుసరించుటవలననని సమాధానము చెప్పవలెను. తనకు, పగటిచుక్కకు బద్ధవైరమని శ్రీధరరావునకు తెలుపవలెను ఆతఁడు కారణమడుగును. మాణిక్యమనుజవ్వని యనిచెప్పి, అవసరమైనంతవఱకుఁ దనకును మాణిక్యమునకు గలసంబంధము—అనఁగా తాను రెండుమారు లామెను వంచింపయత్నించుట—ఆమె తప్పించుకొనిపోవుట—పగటిచుక్క ఆమె ప్రియుఁడగుట నాతని కోపము మొదలైనవి నమ్మకము పుట్టునట్లుగాఁ జెప్పవలెను. శ్రీధరరావు నమ్మును—నమ్మితీరవలెను.

అంతట పురుషోత్తమరా వాతనికొక చీటి చూపవలెను. అది పగటిచుక్క వ్రాసినది. దానిలో నిట్లుండెను.

అరే, పురుషోత్తమరావ్!

శేషరాత్రి 8-12 గంటలలోపుగ నీతలఁ గాచికొనుము—నాచేతి కష్టము లేదు నిన్ను న్యాయముగాఁ జంపకపోయిన ఈ క్రింది చిహ్నములు నేను జన్మలో ధరింపను.

'పగటిచుక్క ★'

ఈచీటి పగటిచుక్క తనను బెదరించుచు వ్రాసినటుల పురుషోత్తమరావు శ్రీధరునితోఁ జెప్పి జూపవలెను. శ్రీధరునికి నమ్మకము ద్విగుణించును. అంతట పురుషోత్తమరావాతని సాయము వేడవలెను. తనబన జెప్పి, తాను దానిని భయముచే విడుచుటలేదనియు—దీనికొఱకే శ్రీధరునిదగ్గఱకు రావలసి వచ్చెననియు మఱి మఱియుఁ జెప్పవలెను. శ్రీధరుఁ డట్టిసాయము కావలయునని యడుగును, పగటిచుక్కను వధించుసాయమని చెప్పి యాతనికిఁ బ్రోత్సాహముకలిగి పగరేగునట్లు పురుషోత్తమరావు మాటలాడవలెను. బహుశః—శతవిధముల శ్రీధరుం డొప్పికొని తానే పురుషోత్తమరావు వేషముతో రాధామమ్మ మేడపై నుండుటకు పన్నుగడ పన్నును—అట్లు పన్ననిచో పురుషోత్తమరావాతనికిఁ దాను పన్నినట్లుగ నీయుపాయముఁ జెప్పును. ఆతఁడు సమ్మతించును. పురుషోత్తమరావు మిక్కిలి సంతసించినట్లగపడి, తనకృతజ్ఞత తెలిపి తిరిగివచ్చి రహస్యముగ పగటిచుక్కకును, రామరాజునకును, దన పోకడపర్యవసానము తెలుపవలెను.

ఈపెద్ద పన్నుగడలో నిది మొదటిభాగము. ఇఁక రెండవ భాగము నవిస్తరముగాఁ దెల్పుచున్నారము.

పై భాగపు పర్యవసానము తమకనుకూలమైనవెంటనే రామరాజు ఆర్మ్ఖము బసకు వెళ్ళవలెను. ఆతనితో నత్యావసర కార్యమొకటి యున్నట్లు చెప్పి, యేకాంతముగా మాటాడఁ గోరవలెను. అప్పుఁడాతఁడు రామరాజును వచ్చినపని యడుగును. రామరాజు తాను పగటిచుక్క ముఖ్యసేవకుఁడై నట్లును— ఆతఁడు పంప వచ్చినట్లును తెలుపవలెను. ఎందుకుఁ బంపెనని హాతకుఁ డడుగును. రామరాజు వినయపూర్వకముగా నొక చీటిదీసి యీయవలెను. ఆర్మ్ఖము దానిని చదువుకొనును— అదియు పగటిచుక్కయే స్వహస్తముతో నిట్లు వ్రాసెను.

ఆర్మ్ఖం.

'తలవని తలంపుగ నీవు మాముఖ్య స్నేహితులలో నొకఁడవైతివి. ఎట్లనఁగా మాణిక్యమను సుందర నాత్రియు రాలు—ఆమెను పురుషోత్తమరా వను దుర్మార్గుఁడు రెండు మారులు చెఱుపయత్నించెను ఆపురుషోత్తమరావు నాగర్భ శత్రువయ్యెను ఇదేకారణము. వానినెట్లో నేను వధింపజూచు చుంటిని. ఇంతలో నీవువచ్చితివి. నీకును వాఁడు బద్ధవిరోధియే. నాబదులు నీవే వానిని హత్యచేయుము నాపగ తీరును, నీపగ తీరును. కాన నీవు నాసేవకులలో నొకఁడవైనగాని నీవు నా యాజ్ఞప్రకారము చంపినట్లు కాదు. నాపగయు సరిగా తీరినట్లు

కాదు. కాఁబట్టి యీక్షణమునుండియు పగటిచుక్క-గుంపులో నిన్ను ఏబది (౫౦) రూపాయల పనివానినిగా ఏర్పరచినాను. హత్యకు బహుమానము ప్రత్యేకము. జీతములోఁ గాదు. ఈనా ముఖ్య సేవకుఁడు నీయనుమానములన్నియుఁ దీర్చును. అతఁడు చెప్పినట్లు నడచుకొనుము.

'పగటిచుక్క ★'

ఆర్ముఖుఁడు విస్మయమును జెందుచు — తప్పక మిక్కిలి సంతోషించెను. రామరాజు చెప్పినమాటలివి. రామరాజాతని బలరాంపేటలోని పగటిచుక్క-బసకుఁ దీసికొనివెళ్ళెను. అచ్చట ఆర్ముఖుడు పగటిచుక్క సేవకుఁడుగా నియమింపఁబడెను. తన ప్రభువునుజూచి సంభాషించును — మెల్లఁగవలసినపద్ధతి గమనించును. ఆతనిని పగటిచుక్క తనవేషమువేసి పంపును. దానిచే పురుషోత్తమరావు గజగజ వడకించవచ్చును. పురుషోత్తమరావును సులభముగాను, నమ్మకముగాను, జంపవచ్చును. ఇదంతయు రాధాయమ్మ మేడపైననే. పురుషోత్తమరావు క్రిందటిరాత్రి రాధాయమ్మగృహము ప్రవేశించుట గాననువరించి కనులారఁ జూచినాఁడు. కాఁబట్టి ఆర్ముఖుడు సంగతులన్నియు నిజమని నమ్మెను.

పన్నుగడ యిది శ్రీధరరావు మేడకు వచ్చుటకును— ఆర్ముఖుమేడ ప్రవేశించుటకును రాధాయమ్మ మొదలగువారి కెఱుక లేకుండ ఏర్పాటులు జరుగును. ఇదియంతయు మఱు

నాఁటిరాత్రి జరుగవలసియుండెను. ఈచిత్రనాటకము జరిగితీరు ననుటకు సందియము తోఁచుటలేదు.

పురుషోత్తమరావు చీటితీసికొని శ్రీధరరావునుదర్శించెను. అంతయు వారు యోజించిన ప్రకారమే జరిగెను. శ్రీధరరావు చీటిని జూచెను. గోవిందంపంతులు మాటవినెను సంగతు లన్నియు నిజమని నమ్మెను. పురుషోత్తమరావు వేషముధరించి రాధాయమ్మమేడపై గదిలో నాతనికిబహులుగఁ దానుండు పన్నుగడ తానే పన్నెను. మహానతోషముతో పురుషోత్తమ రావామోదించినట్లు కన్పడెను. తనకృతజ్ఞతా పూర్వకవందన ములు దెలిపి పురుషోత్తమరావు తిరిగివచ్చి సంగతులన్నియు రాజునకును, మంత్రికిని పరమరహస్యముగఁ దెలియఁజేసెను.

ఇఁక పన్నుగడలో రెఁడవభాగ ముండెను. రామరాజు తనచీటిని తీసికొని అమ్మళమ్మునకు బయలుదేరెను.

---

## ఇరువదియారవ ప్రకరణము

---

### త్రాగుబోతు

గద్వపురములోని యొక కల్లుదుకాణములో అమ్మళము మద్యము సేవించుచుండెను. ఈవిషయములు శ్రీధరరావు చంద్రముతో సంభాషించిన నాటిసాయంసమయమున జరుగు

చుండెను. ఆర్యముఖుని ప్రస్తుతపుబస యీకల్లుదుకాణమే. ఒక్కొక్క లొట్టెడు కల్లుద్రావి, తలయూచుచు నాతఁడొక్క గంటసేపు యోజించుచుండెను. ఈలోపుగ వచ్చి పోవువారు పోవుచుండిరి. తాళామృతమును సేవించువారు సేవించుచుండిరి. తప్పద్రాగుటచేఁ గొందరికప్పుటనే శివమెత్తుచుండెను. అట్టివారిని దుకాణదారుఁడు మర్యాదగా సాగనంపుచుండెను.

రామరాజు దుకాణము ప్రవేశించెను. ఆతనినేత్రములొకమారు చుట్టును గలయఁజూచి యార్యముఖుని వదనముపై విశ్రమించెను. రామరాజు త్రాగుబోతును బరిశీలించెను. మెల్లగా సమీపించి భుజముపైఁ దట్టెను. ఎఱ్ఱనికన్నులతో ఆర్యముఖుఁడు మెల్లగా రామరాజు గమనించెను. ఆతనిముఖమున నాశ్చర్యభావము తోఁచెను.

ఆర్యముఖం! అని రామరాజు మెల్లగా సంబోధించెను.

ఇచ్చట నన్నట్లు పిలువకుము, అనుచు ఆర్యముఖుఁడాతని నోటిపైఁ జేయిపెట్టెను.

రామరాజాతనిచేతిని దీసివేసి, 'నీతో అత్యవసరవిషయమున మాటాడవలసియున్నది ఆమూలకురమ్ము' అనెను.

నాపేరు నీకెట్లు తెలియును?

నాకన్నియుఁ దెలియును—రమ్ము.

అన్నియు ననఁగా?

నీపేరు—వృత్తి—నీవు గర్తపురము వచ్చినపని.

కిల్లిగోటా క్రిందఁబెట్టి ఆర్ముఖము లేచెను. ఆతఁడును, రామరాజును వాడుకాణములో నొకమూలఁ జేరి కూర్చుండిరి. రామరాజు ప్రసంగ మారంభించెను.

పగటిచుక్క పేరెఱుఁగుదువుగదా ?

బాగుగా.

ఆతని ముఖ్యసేవకుఁడను.

ఆర్ముఖము తెల్లవోయి చూడఁజొచ్చెను.

నీవు భయపడకుము రామరా జనెను. 'మేము నిన్నుద్ధరింపవచ్చితిమి.'

నన్నా ? ఎట్లు ?

పగటిచుక్కకుఁ దెలియనివిషయముండదు, నీసంగతి యాతనికిఁ బూర్ణముగాఁ దెలియును.

నీకు ?

నాకును దెలిసినది.

ఈ ఊరిలో నాపని యేమి ?

హత్య.

ఎవరిని ?

గోవిందంపంతులను.

ఆర్ముఖము పెద్దయొట్టు పెట్టుకొని గొణుగుకొనెను. గోవిందంపంతులు అసలుపేరేమి ?

పురుషోత్తమరావు పెట్టుకొనినపేరు—అసలుపేరే గోవిందంపంతులు.

త్రాగుబోతునింతతో రామరాజుభుజముపైఁ దట్టుచు 'ఈసంగతు లన్నియు మీకెట్లు తెలియును?' అని యడిగెను.

పగటిచుక్కకు దివ్యదృష్టి ఉన్నది.

అబ్బా! చిత్రమే మఱి నీవు వచ్చిన పనేమి?

నీవు ఒళ్ళుతెలిసి ఉన్నావా?

పూర్ణముగా

చదువఁగలవా?

తెలుఁగైన చక్కఁగా చదువఁగలను.

ఇదిగో పగటిచుక్క ఉత్తరము! అనుచు రామరాజు చీటిదీసి ఆర్ముఖమున కొసఁగెను.

ఆర్ముఖము దానిని నాలుగైదుమారులు మిక్కిలి జాగ్రత్తగాఁ బఠించెను. చదివినకొలఁదిని నాతనిముఖమునఁ గళ హెచ్చెను. రామరాజు దానిని కనిపెట్టెను.

ఏమందువు? అని రామరాజడిగెను.

ఈచీటిలోనిసంగతులు నిజమైన నావని తీరును——నాకు లక్ష్మ యెత్తుకొనును.

ఇంకను సందేహమా?

ఆలోచించుకొననిమ్ము.

ఆర్ముఖము యోజించెను. వారు తనను మోసపుచ్చ జూచుచున్నారా? దేనికి? వారికి వచ్చులాభమేమి? వారెవరు? తానెవఁడు? తనను మోసగించుటకు వారింతశ్రమపడలేనేల? ఉత్తరములో సంగతులను సంశయించ నక్కఱలేదు. యుక్తి

మంతుండగు పగటిచుక్క నెట్లో—తన 'దివ్యదృష్టి'చే సంగ తులు గ్రహించి పనిముట్టుగా దన నుపయోగించుకొనఁదలచెను అయిన నష్టమేమి? లేశమును లేదు. లాభము? నెల కేబదిరూ కల జీతము— హత్యబహుమానము వేరు! మీఁదుమిక్కిలి తాను ఒంటరిగా యత్నించి గోవిందపంతులును జంపజూచు టలోను, జగద్విఖ్యాతుఁడగు పగటిచుక్క సాయమున హత్య చేయుటలోను హాస్తిమశకాంతరము గలదు. తనయుద్యమము నకు పగటిచుక్క తోడైన, చెప్పనక్కఱలేదు.

ఆలోచన అయినదా? అని రామరాజడిగెను.

అయినది.

పర్యవసానము?

షరతులకు అంగీకరించితిని.

మనస్ఫూర్తిగా?

ఆహా!

మంచిది.

హత్య యెప్పుడు జరుగును?

రేపురాత్రి.

ఏసమయమున?

ఎనిమిదిమొదలు—పండ్రెండు లోపుగ.

విశేషములు చెప్పెదవా?

నీవు మొట్టమొదట మాముతాలో చేరవలెను.

ఎప్పుడు?

ప్లైన ఇప్పుడే
చేరిన ?

పగటిచుక్కను జూతువు—సంగతులాతఁడే తెలుపును.

సిద్ధము—
రమ్ము.

రామరాజు లేచెను. దుకాణదారునకు ఆర్ముఖము త్రాగిన దాని వెల యిచ్చెను. కృతజ్ఞుఁడై ఆర్ముఖ మాతని వెంబడించెను.

విశేషములు చెప్పనక్కరలేదు. అర్ముఖము పగటిచుక్కను దర్శించెను అతని గుంపులోఁ జేరెను. తన యనుమానములన్నియుఁ దీర్చుకొనెను. మెలగవలసిన పద్ధతి నేర్చుకొనెను. పగటిచుక్క వేషమున రాధాయమ్మమేడలో గోవిందపంతులును మరునాఁటిరాత్రి హత్యచేయుట కంగీకరించెను. మిక్కిలివాడిగల చురకత్తి తీసికొని యాతఁడు తనబసకు దిరిగి వచ్చెను.

---

## ఇరువది యేడవ ప్రకరణము

---

### మఱునటిరాత్రి

మఱునాఁటిరాత్రి యెనిమిది గంటలప్పుడు శ్రీధరరావు తన పెంకుటింటిలో దీపమెదుటఁ జాపపై గూర్చుండి యోజిం

చుచుండెను. అతనిసరసనే యాసీనయైయున్న చంద్రము నేదో యాలోచనలో నుండెను. ఇరువురి గంభీరవదనములును నా చిన్ని దివ్వె వెలుఁగులో విస్పష్టముగాఁ గానవచ్చుచుండెను. యోజించి, యోజించి యొకనిశ్చయమునకు వచ్చినవానివలె శ్రీధరుఁడు తలయూచెను. అంతటఁ దనదృష్టి నకస్మాత్తుగా చంద్రపై బఱపెను. ఆలోకమోహన సౌందర్యమును జూచి నప్పుడాతని కన్నులవెంట రెండు నీటిచుక్కలు చెక్కిళ్ళపైఁ బడెను. కాని దయ త్రుటిలో నంతరించెను. మఱు క్షణములో నాతని నేత్రద్వయము నిప్పుకణమువలెఁ బ్రకాశింప దొడఁగెను. ఆభావము నడచిపెట్టి యాతఁ డామెతో శాంతముగా నిట్లు ప్రసంగ మారంభించెను.

చంద్రం! గంభీరవిషయములు మాటాడవలసియున్నది. నీదృష్టియిటు మరల్పుము.

'ఏమిటి?' అనుచు నామె తనముఖ మాతనివంకఁ ద్రిప్పెను. ఎందువలననో యాతనికంఠముతీరు కర్కశముగా నున్నట్లామెకుఁ దోచెను. ఆమె వడఁకెను.

చంద్రం! నేఁడు నేను మృత్యుజీవములకు నడుమఁ గడ వపై నిలుచున్నాను. అటుపడెదనో, యిటుపడెదనో బ్రహ్మదేవుని కెఱుక— అగునా?

అగును.

మంచిది. నేనొకవేళఁ జచ్చుటయే సంభవించిన?

చంద్రము ప్రత్యుత్తర మీయలేదు.

చంద్ర! నీవీసమయమున మౌనము వహించవలదు. నాప్రశ్నలకు సమాధానము చెప్పుము అని వికృతముగా నాతఁడు హెచ్చరించెను.

నేనేమి చెప్పను? అని జవ్వని దీనముగా నడిగెను.

నా మనస్సు నాకు నొక్కిచెప్పుచున్నది. ఏమంటివా? నేఁడు నాకుఁ జావుతప్పదు—తప్పదు—తప్పదు. నేను చచ్చియే తీరవలెను. అయిన నేఁబోవుట యెందుకందువా? ఎవరికర్మ వారి నీడ్చుకొని పోవుచుండును. నేనును వెళ్ళుచున్నాను. పర్యవసానము నాకుఁ దెలియును. చావు! అక్షరాల చావే! అయినను లెక్కలేదు. నాకీభువిలో బందుగులు లేరు జీవితము నాకుఁ జాలకాలమునుండి విసుగుఁ దోఁచినది. వీలైన శత్రువును జంపెదను. లేనిచో విరోధిచేతిలోఁ జచ్చెదను. నిన్నడుగున దేమన— చేపటినుండియు నీగతియేమి?

భగవంతుని కెఱుక!

ఛీ, ఛీ! మనము ఘోరపాపులము. మన మహాపవిత్ర నామ ముచ్చరించుటకుఁ దగము— ముమ్మాటికిని దగము. దానిని దేకుము. నీగతియేమి?

నాకెట్లు తెలియును?

మఱియొకసంగతి. ఒకవేళ నేఁడు విజయమందుట సంభవించినను—ఏ చుఱుకత్తి పగటిచుక్క హృదయరక్తము చవి

చూచునో—అనుమాట క్షణమే యది నాప్రాణశోషము సహితము ద్రావును. తెలిసినదా?

తెలిసినది. అని భయపడుచు నామె మెల్లగా సమాధాన మిచ్చెను.

మంచిది—ఇంక వేఱుసంగతులేల? గెలిచినను, ఓడినను నేఁడు తెల్లవాఱునప్పటికి శ్రీధరుఁ డీలోకములో నుండఁడు—అనగా నాతనియాత్మ యాని నాఅభిప్రాయము. మీఁద నీగతి యేమి?

ఇట్టి దారుణమైన ఆలోచన నీకేల గలిగినది?

ఏది?

గెలిచినను ఆత్మహత్య చేసికొనవలెనను గట్టి పట్టుదల.

మరలమరల నన్నడుగవద్దు. ఒకమాఱే చెప్పుచున్నాను. నాకీజీవితముపై విసుగు జనించినది. బాగుగా గ్రహించుకొంటివా?

గ్రహించుకొంటిని.

ఒక్కమాఱే—చివరసారి—అడుగుచున్నాను. మీఁద నీగతి యేమి?

నీకెందుకు? నీదారి నీది. నాదారి నాది.

అదెట్లు?

అనఁగా?

చంద్రం! నీదారి నీది యనఁగా నాకర్థముకాలేదు. నీ యభిప్రాయమేమి?

నీకనవసరము గదా ?

పిచ్చిదానా ! ఎన్నటికిని గాదు, నాకు చాల అవసరము.

ఔనా ! ఎట్లో ?

నేను నిశ్చింతగా నెట్లు చనిపోవలయు ?

నేనడిగిన నీకుఁ దృఢాభిప్రాయమైనపుడు నాభిప్రాయముతో నీకేమిపని ?

అట్లుఁ గాదు. నీవు నన్ను నమ్ముకొని పగటిచుక్కను విడిచివచ్చితివి. కాఁబట్టి నీపూఁచీ నాకుఁ దప్పదు.

అట్లయిన నీవేల చావనిశ్చయించుకొంటివి ?

నన్నా ప్రశ్న అడుగవద్దంటిని.

అనఁగా—నీమీఁద ఆధారపడి నేనున్నప్పుడని నాఅభిప్రాయము ?

మంచిది. చెప్పుదునా? నీకు ధైర్యముకలదా?

చంద్రుఁడు పగటిచుక్క ప్రియురా లనుట మఱవకుము!

మఱవలేదు. మఱవను. క్రియలోఁ జూడవలసియున్నది.

చూడవచ్చును

అయిన. చంద్రం ! నీకొకదారి చేర్పఱచియే యున్నానుసుమా ?

తెలిపిన సంతోషింతును.

చెప్పెదనుకాని నిన్ను ముందుగఁ గొన్ని ప్రశ్నలడిగెదను

అడుగవచ్చును.

పగటిచుక్కను విడిచినది—మరల నాతని జేరవలెనని యుద్దేశము కలదా ?

జన్మలో లేదు. ఉండదు.

సరి. నే చనిపోయినట్లే యెంచుకొనుము. ఏమి ?

అట్లే.

మేముతప్ప నీయందభిమానముగలవారెవ్వరున్నారు?

ఎవ్వరును లేరు.

నీవిక జీవించి యేమిలాభము ?

చంద్రము ప్రత్యుత్తరమీయలేదు. ఆమె శాంతముగా యోజింపఁ జొచ్చెను. కొలఁదికాల మున్నతరువాత శ్రీధరరావు మరల నిట్లనెను.

బ్రతుకవలెనని యిచ్ఛగలదా ?

లేదు, అని యామె దృఢముగాఁ జెప్పెను.

శ్రీధరరావు సంతోషించిన ట్లగుపడెను. 'మంచిది. ఇఁక నేను నీకేర్పఱచిన దారి చెప్పుదునా ?

చెప్పుము.

మనస్ఫూర్తిగా అవలంబింతువా ?

మనస్ఫూర్తిగా.

పగటిచుక్కను మనము చంపవలెనని యెంచితిమి. దేనిమూలమున ?

విషపుచుక్కలచే.

ఆవిషమింకను నాయొద్దనున్నది ఉపయోగింతువా?

నీయిష్టమైన.

నాకిష్టము కనుకనే చెప్పుచున్నాను.

తప్పక యుపయోగింతును.

స్త్రీ సాహసమునందు ప్రచండవైరాగ్య మున్నది. చంద్రము పై వాక్యమును మిక్కిలి శాంతముగా వచించెను. వాక్యము చిన్నదే. దానియం దఖండార్థ ముండెను. శ్రీధరరావు దానిని గ్రహించెను. అంత త్వరగా చంద్రమట్టి ఘోరనిశ్చయమునకు నెట్లు వచ్చెనోయని యాతనికి వింతజనించెను. ఆతఁడిట్లనెను.

బాగుగా ఆలోచించుకొనుము.

పరిపూర్ణముగా యోజించితిని.

అయినను మరల విశదీకరించెను. పగటిచుక్క నీగర్భశత్రుఁడు. శ్రీధరుఁడు మృతుఁడు. చంద్రముజన్మ నిరర్థకము కావున నామె మరణము నిశ్చయించుకొనినది. అందులో— మిక్కిలి త్వరగాఁ జచ్చునుపాయ మున్నది. ఆమె దాని నవలంబింపఁబోవుచున్నది వరేనా?

తథాస్తు.

నేటిరాత్రియే— ఇప్పుడే! దేనికనఁగా— శ్రీధరుఁడు ర్మలహృదయముతో మరణించుటకొఱకు అవునా?

నిజము.

చంద్రం! అయిన ఒకగ్లాసునిండ నీళ్ళు తీసికొనిరమ్ము.

మాఱుమాటాడక చంద్రము వెంటనే యొకగ్లాసునిండ మంచినీరము దెచ్చి యాతనిముందు బెట్టెను.

విషము కలుపుదునా?

సంశయింపక.

శ్రీధరుఁడు బుడ్డితీసి సగము నీటిలోఁ బోసెను. ఆద్రావకము నీటిలోలీనమైపోయెను. మిగిలినదానిలోఁ గొంత చుఱుకత్తి చివరఁబూసి శ్రీధరుఁడు బుడ్డి దాచెను. అంతట నతఁడామెతో నిట్లనెను.

చంద్రం! మృత్యువు నిన్ను క్షణములోఁ దన సన్నిధికిఁ దీసికొనును. నేను దాచినవిషము అవసరమైన నా కుపయోగించును. పుచ్చుకొనెదవా?

'ఆ' అనుచు చంద్రము నీటిపాత్ర పైకెత్తెను.

ఆగుము ఆగుము! అనుచు శ్రీధరుఁ డామెచేతిని బట్టుకొనెను. ఆతని కన్నులవెంట బాష్పములు ధారలుగట్టెను. "ఓ పిచ్చిచంద్రం! నా ప్రాణమా! నన్నిట్టి యవస్థకుఁ దెచ్చితివి! నీవిట్టి యవస్థపాలైతివి! మన యిర్వురిజన్మలు నాశన మొనర్చితివి. నీచావు కనులారఁ జూడలేను. జన్మలోఁ జూడఁజాలను!

శ్రీధరా! నీవు నిశ్చింతగాఁ జావఁగోరితివి. నన్ను కూడ నిశ్చింతగాఁ జావనీయువా?

నిరభ్యంతరముగ—

అయిన వెనుకటి సంకేతము లుచ్చరించుము—అది పెద్ద యగాధము—అది యెటుండనిమ్ము. నేను దేవుని ప్రార్థించుకొని యీసారి త్రాగెదను!

మంచిది. ముఖముపై చేతిరుమాలు గట్టెదను.

దీపము నా కాలుదగ్గఱ పెట్టెదను నీవు నాకొకగుర్తు చెప్పుము దీపము తన్ని నేను నాయుద్యమముమీఁదఁ జనెదను.

మంచిది. నేను మనములోఁ బ్రార్థించుకొని బిగ్గఱగా 'తథాస్తు!' అనెదను. వెంటనే నీవు పుచ్చుకొనెదవు—అనగా కాలకూటవిషము. అదే గుర్తు.

శ్రీధరరావు చుఱకత్తిఁ బట్టుకొని లేచి దీపము కాలు ముందు బెట్టి చంద్రమున కెదురుగ నిలిచెను. చంద్రం తనంతటనే పెద్ద చేతిరుమాలు ముఖముపైఁ గట్టుకొనెను. అంతయు సిద్ధమాయెను.

ప్రార్థించుకొనుము.

మొదలుపెట్టుచున్నాను. నీవు సిద్ధముగా నుండుము. గుర్తు 'తథాస్తు'

జ్ఞాపకమున్నది.

చంద్రము ఏమో అయిదు నిమిషములకాలము గొణుగుకొనెను. శ్రీధరుఁడు ప్రతిమవలె నట్లే నిలిచియుండెను.

ఎట్టకేలకు 'తథాస్తు!' అని చంద్రంనోటినుండి స్ఫుటముగ వినవచ్చెను.

మఱుక్షణమునందో నామె యూసీటిని గుటగుటఁ ద్రావి వైచెను.

దేవుఁడా! మా నేరముల క్షమింపుము! క్షమింపుము! అనుచు శ్రీధరుఁడు దివ్వెను ఫడేలున దన్నెను.

ఆదీప మారి గోడకు బిట్టుగఁ గొట్టుకొనెను.

ఇల్లంతయు క్షణములో గాఢాంధకారము!

శ్రీధరుఁడు చకచక యింటివెలుపలికివచ్చి తలుపువైపుఁ జూచుచుండెను. ఆసమయమునకు సరిగా నింటిలో నేలపై నేదియో తటాలునఁ బడినట్లు పెద్దచప్పుడాయెను

ఈశ్వరా! ఆనుండరి ఆత్మకు శాంతముగాఁ గొనుము— శాంతముగా శాంతముగా—శాంతముగా! అనుచు శ్రీధరుఁడు కవాటము వేసెను.

మఱునిమిషములో నాతని యాకార మావీధి చీఁకటిలో లయమైపోయెను.

---

## ఇ రు వ ది యె ని మి ద వ ప్ర క ర ణ ము

---

### మ ఱ న టి రా త్రి 2

రాధాయమ్మ మేడకు వెనుకభాగమున నొక చిన్న సందుఁగలదు. వెనుకఁజెప్పియుంటిమి. ఆసందు గడచియే రామ

రాజు మేడలోనికి శ్రీమంతుని జూచుటకు వచ్చుచుండెడివాఁడు. దానిలోనే యొకనాఁటిరాత్రి శ్రీధరుఁడు రామరాజును హత్య చేయఁబ్రయత్నించెను. రామరాజాతని నొక చేపట్టునకు బంధించినట్లు మనకుఁ దెలియును. ఆచెట్టానందుచివర నుండెను. అచ్చటనే చంద్రము వచ్చి శ్రీధరుని విడిచిపుచ్చెను. ఆనందు లోనికి మరఁల జమువరులను నేఁటిరాత్రి ప్రవేశపెట్టుచున్నారము

రాత్రి పదిగంటలాయెను. గోవిందపంతులానందులో నిలిచి యొక పురుషుతో గుసగుసలాడుచుండెను. ఆపురుషుఁడు శ్రీధరరావు ఆనందు ప్రవేశించిన వెంటనే యచటఁ దాను యత్నించిన హత్యయు—పర్యవసానమును—చంద్రము తనను విడిచిపుచ్చుటయు నాతని కొక్కమారుగ జ్ఞప్తికి వచ్చెను. ఇప్పుడు చంద్రం—అభువనైకసుందరి—యేమైనది? బావురుమనుచున్న యానందులోని కటికిచీఁకటి యామెను దనపొట్టను బెట్టుకొనినట్లు శ్రీధరరావునకుఁ దోఁచెను ఆమె యుదార స్వభావమున కాతనికి మెప్పువచ్చెను—తానొనర్చినపనికి పున పశ్చాత్తాపము గలిగెను. తనను సర్వస్వముగ నమ్ముకొనిన యాసుందరి గొంతు తాను కర్కశముగా కత్తిరించెను. ఆమెను నిరాశపాలుచేసెను. తన పానముచే నామెను చిక్కులి సంతాప పెట్టెను.........

శ్రీధరుఁ డొకగోడకుఁ జేరగిలి కన్నీరు గార్చుచుండెను. ఆతని హృదయమిట్లు పలవించుచుండెను. ఓనిర్మలతేజమా!

నేఁటిరాత్రి నీ వీగాఢాంధకారములో లీనమైపోతివా? నాకన్నుల వెలుఁగు నీలో లయమై, నీతో నశించెనుగదా? ఇఁక నేనంధుఁడను. ఈ మహాలోకములో నిస్సహాయుఁడను. ఏకాకిని, ఓపుష్పరాజమా! నాహృదయసీమ నలంకరింపక, నన్నలరింపక, యింకొకనికి కేల సుఖమిచ్చితివి! నీమాధుర్యమితరుల పాలొనర్చి నీకంటకముల నామనమున గ్రుచ్చిపోతివా! చంద్రం చంద్రం! ఎంత పనిచేసితివి! నవవయావనచకోరకము నెట్లు మొగ్గలోఁ ద్రుంచివైచితివి! భావిసౌఖ్యాంకురము నెట్లు నిర్మూలించితివి! ఎంత తెగువచేసితివి! —స్త్రీహృదయము అనంతవినీలమహాసముద్రముకంటెను లోతనిపించితివే! ఒక్కవనితతో మన ప్రాణనాళముల విషపూరితములఁ జేసితివే! జీవితము కటు వనిపించితివే!

ఒక చల్లనిహస్తము శ్రీధరుని భుజముపైఁ దాకెను. ఉలికిపడి యాతఁడు ప్రక్కకుఁ దిరిగెను అచట నొక యున్నతాకారము నిలిచియుండెను. తేజము ముందరి తిమిరమువలె శ్రీధరుని యాలోచనలన్నియుఁ జెల్లాచెదరై పోయెను. అతని హృదయము నావరించియున్న యంధకారము నశించెను. ఒక్కటే వెలుగు అచట మండఁ దొడఁగెను. అదియే పగ—పగ. ఎవరిపై? ఈజ్వాల యెవ్వరిని దహింపవలెను? ఎవ్వరిని భస్మీభూతము చేయవలెను? పగటిచుక్క—తరువాత? సృష్టించిన తనను!

పురుషోత్తమరావా! అని శ్రీధరుఁ డావ్యక్తిని సంబోధించెను.

అవును. అని గోవిందంపంతులు చెప్పెను.

లోనికి వెళ్ళుదము ?

నా అభ్యంతరము లేదు.

దారితీయుము.

పురుషోత్తమరావు ప్రహరీగోడలోని ద్వారము నిశ్శబ్ద ముగఁ దెఱచెను. 'రమ్ము త్వరగా' అని యాతఁడు తోట ప్రవేశించెను. శ్రీధరరావు లోనికేగి, కవాటమును బంధించెను ఇరువురు మేడను సమీపించిరి.

విరోధికొఱకు మనమెచ్చటఁ బొంచుదము? అని శ్రీధరుఁడడిగెను.

మనము వెదవేమి? నేనుకూడ నుండనా?

అవసరములేదు. నేనెచ్చట పొంచను?

యుక్తప్రదేశము నీవే వెతుకుకొనుము.

నీవు సలహా చెప్పుము.

అయిన మేడలోపైన నాగదిలోనున్న మంచిదని నేనను కొనెదను.

పగటిచుక్క అచటికి వచ్చునని నమ్మెదవా.

తప్పక అని గోవిందపంతులు చెప్పెను

అయిన నచ్చటికే దారితీయుము.

పురుషోత్తమరావు దారితీసెను. మేడ క్రిందిభాగముంగడచి వారుపై కెక్కిరి. క్రింద నిశ్శబ్దముగ నుండెను. వాఁడు

రాధాయమ్మ మొదలైనవారు అప్పుడే నిద్రించిరి. మేడపైన వారొకగదిఁ బ్రవేశించిరి. అది విశాలముగనుండెను.

ఇది నీగదియా? అని శ్రీధరరావడిగెను.

ఔను.

ఇప్పటికేకదా పగటిచుక్క వత్తునని బెదరించినది.

నిజము—నేఁడిఁక నిచటనుండను. ఇదిగో నా దుస్తులు. చురకత్తి నీయొద్దనే యున్నదికదా?

ఉన్నది.

ఈదుస్తుల ధరించి సిద్ధమైయుండుము. నీకు జయమగు గాక! జయమగుగాక! జయమగుఁగాక!

భగవంతుని యిష్టానుసారము జరుగును.

పురుషోత్తమరావు నిష్క్రమించెను. అతఁడు క్రింద నొకగదిచేరి, తలుపు దిట్టముగా బంధించి, యొకశయ్యపైఁ గూర్చుండి చెవులు నిక్కించి, జరుగఁబోవు భయంకరవిషయములకు వేచియుండెను.

శ్రీధరరావు పురుషోత్తమరావు దుస్తుల ధరించెను. దీపముతగ్గించి యాతఁడు శాంతముగా ఎవరికొఱకు వేచియుండెను. ఆకను వెలుతురులో నాతఁడు నిజముగా పురుషోత్తమ రావువలెఁ గన్పట్టుచుండెను. గదితలుపు దగ్గఱగ వేయఁబడి యుండెను. పురుషోత్తమరావు వెళ్ళుచున్నప్పుడు దాని నట్లుచేసి పోయెను. శ్రీధరరావు దానిని బంధింపలేదు— బంధింపఁ దలఁచుకొనలేదు. చురకత్తి పిడికిట గట్టిగాఁ బట్టుకొని

యాతఁడు దానిని తన ప్రక్కనే సిద్ధముగ నుండెను. క్షణమున
నెవరైన గదిఁ బ్రవేశించిన—వారెవరో చూడకపూర్వమే—
ఆతఁడు వారిపై బడి ముక్కలు ముక్కలుగ నఱకుస్థితిలో
నుండెను.

పగయనునది పాపిష్ఠిది. అది హృదయములోఁ జేర
కూడదు. ఒకమారు దానికచట స్థావరమేర్పడిన తరువాత
దానిని వెడలఁద్రోలుట దుర్ఘటము. ముఖ్యపట్టణము చేఁజిక్కిన
విరోధి రాజువలె నది హృదయపీఠమునుండి రక్తనాళముల
నన్నిటి నేలుచు శరీరమును గడగడవడఁకించు చుండును.
ఆయావేగమునకు మనసు నిలువఁజాలదు ఆయుద్రేకమును
దేహము భరింపఁజాలదు. ఆయదరిపాటునకు మేధస్సు సహింప
లేదు. అడ్డము వచ్చినవారిని మ్రింగివేయువలయు నన్నంత
యాతురత జనించును— నిత్యము నొకేజపము— పగ!
పగ! పగ!

శ్రీధరుఁడు చెవులు ఱిక్కించి వినుచుండెను. సుమారొక
యరగంటదాఁటెను, శ్రీధరుని మనసు వశము తప్పిపోవునట్లుం
డెను. ఎవరినో యొకరిని పొడుచుదనుక నాతనికిఁ దోఁచునట్లు
లేదు ఆతఁడు వినుగుత్తో లేచి మెల్లగాఁ దలుపుసమీపించెను.
చుఱకత్తి యాతనికుడిచేతియందు గట్టిగా నమరియుండెను.
ఆతనిప్రాణ మంతయు నిప్పట్టున దానిలో నుండెను. శ్రీధరుఁడు
మెల్లగా—నిశ్శబ్దముగాఁ దలుపుఁదెఱచెను. మెట్లపై చీఁకటిగా
నుండెను. ఆతఁడు దృష్టిసారించి చూచెను. కటికిచీఁకటి.

'గయాసూర్!' అని పెద్దపెట్టునఁ గేకవేసి యెవరో యాతని గుండెలలోఁ గత్తితోఁ బొడిచిరి ఆకత్తి మెఱుపువలె తళుక్కున మెఱసెను.

శ్రీధరరావు నివ్వెరపోయెను. ఆతనిగుండె జల్లుమనెను. మఱుక్షణములో కత్తిపోటాతని మేల్కొలిపెను. 'అరే లుచ్చా! నేటితో ఫైసల్! అని భయంకర సింహానాదము చేసి యాతఁడు తనవిరోధిని వక్షములో చుఱకత్తి పిడికిటివఱకు పొడిచెను

'హాతకుఁడా! గోవిందం—వం—తు—లు—నన్ను చంపితివిరా—అరే' అనుచు శ్రీధరుఁడు పొడిచిన ఆర్ముఖము మేడమెట్లపై దభాలునఁ గూలి విలవిలనాడ జొచ్చెను.

శ్రీధరుని నేత్రములలో తేజము నశించిపోయెను. ఆకంఠస్వర మెవ్వరిది? పగటిచుక్కదికాదు. మఱి? శ్రీధరుఁడు గదిలోనికి దీపముకొఱకు రెండడుగులు వైచెను. ఆతనిపాదములు వడకెను. శరీరముతూలెను—కన్నులు తిరిగెను—మొదలు నఱికినవృక్షమువలె నాతడు గదిలోఁ జాపపై బడెను.

కాని ఆతనితెలివి తప్పిపోలేదు. చచ్చుట నిశ్చయమని యాతడెంచుకొనెను. తానెవ్వరిని హత్యచేసెను? తన్నెవ్వరు చంపిరి? ఆభయంకరసమయమున నాతనికి చంద్రము జ్ఞప్తికి వచ్చెను. చంద్రమెట్లు వచ్చినది?—తనవిషము త్రాగి—చావునకు ముందు? భగవంతుని ప్రార్థించినది. తానో?

శ్రీధరుఁడు బలవంతముగ తన యుంగరములోనుండి విషపుసీసా తీసెను. అది యాతని నోటికిఁ జేరుటయెట్లు? తనచేయి స్వాధీనము తప్పిపోవుచుండెను. తప్పిపోయెను. అయినను తుది యత్న మొక్కటి యాతఁడు చూచెను. లాభము లేదు. సీసా చేతిలోనుండి క్రిందబడెను ఆసంగతి యాతనికిఁ దెలిసినదో లేదో! ఆతని కన్నులు మూసికొనిపోయెను. నోటనురుగులు వచ్చెను. "సీ—సా—ప—క్క—దు—" ఏమో! ఏమో! ఆతఁడు పలవరించెను. మాట క్రమక్రమముగాఁ బడిపోయెను—ముఖము నల్లబాఱెను—రుధిరము కారుట యాగెను—శ్వాస నిలిచెను. ఆగడిలో నాతని శవము మిగిలెను.

మఱి పదినిమిషములకు దివ్వెపట్టుకొని రామరాజును—ఆతని కిరుప్రక్కలను పగటిచుక్కయు గోవిందపంతులును మేడపైకివచ్చిరి వారు మెట్లన్నియు నెక్కుచువచ్చినప్పుడు తుదిదానిపై అర్ముఖము శవము పడియుండెను. ఆతని ముఖము బొగ్గు నలుపుగానుండె నెట్టిధీరునైన గుండె దడదడలాడింపజాలి యుండెను. అచ్చటి రెండుమెట్లపైనను—గదిగడపముందునను నెత్తురు కన్నులు మిరుమిట్లు గొలుపుచుండెను. గదితలుపు తెఱచియుండెను. లోపల శ్రీధరుఁడు నిల్వున బడియుండెను. ఆతని హృదయములో నొకకత్తి—అర్ముఖము గుండెలలో నొకకత్తి—రెండిటి పిడికిళ్ళు భయంకరముగా గన్పట్టుచుండెను. శ్రీధరుని చుట్టు నెత్తుటిమయము!

రెండు శవములు! పదనిమిషములలో! రెండు నొక దాని కొకటి నాలుగడుగులదూరములో నుండెను ఆఘోర నాటకము వన్నుగడప్రకారము జరిగినది. పగటిచుక్క ప్రచం డోపాయము నెఱవేరినది. ఆభయంకర ప్రదర్శనమును జూచి నవ్వాడు గోవిందంపంతు లాపాదమస్తకము వడకెను పగటి చుక్క తలఁచుకొనిన—తను మూడవశవమై యుండును!

వారి యోజనల ప్రకారము! పాపము! శ్రీధరుఁడు పురుషోత్తమరావు దుస్తులను—ఆర్యమ్ముఖము పగటిచుక్క వేషమును ధరించియుండెను. కాని వారి కామాయోపము లగత్యము లేకపోయెను. ఒకరికిఁ దెలియకుండ నొకరిని వారొండొరులు జంపికొనిరి. ఆర్యమ్ముఖమనుకొనినట్లుగ పురుషోత్తమరావు నిద్రించుచుండలేదు. శ్రీధరుఁడూహించిన రీతి పగటిచుక్క డంబముగా గది ప్రవేశింపలేదు.

హాతకులు హాతకులు నిట్లొండొరుల నాశన మొనర్చుకొందురు గాక! అని పగటిచుక్క శాంతముగాను, గంభీరముగాను నుచ్చరించెను.

'తథాస్తు!' అని రామదాసనెను.

క్రూరులు క్రౌర్యమున కెరయగుదురుగాక.

తథాస్తు.

సాధువులు శాంతమరణము నొందుదురుగాక.

తథాస్తు.

పగటిచుక్క తనసహచరులకు సంజ్ఞచేసి మేడ దిగి పోయెను. అచట వారుముగ్గురు నొకగదిలో జేరిరి.

కర్తవ్యమేమి? అని గోవిందంపంతులు భయపడుచు నడిగెను.

ఏమున్నది ? పగటిచుక్క సమాధానము చెప్పెను. 'ఆశవములు దొలగించి మేడ పరిశుభ్రపరుపవలెను.'

ఔను అని పంతులు తలయూచెను.

నాభటు లింకొక గంటసేపుగ వచ్చి తోటలో గోయి త్రవ్వి, దానిలో శవముల బాతిపెట్టి మేడకరిగెదను. ఈ పను లన్నియుఁ బూర్తియగునటుకు నీవు రాధాయమ్మ వారియొద్దకేగి మాటలమధ్యపెట్టి, వారి నీసంగతి యేమఱఁజేయుము. ఆ కేకలను వారు వినియుందురు. దానికేవో కొంచెము మాయ మాటలు సమాధానము చెప్పుము.

సరే.

మేముపోయి భటులఁ బంపెదము.

తప్పక పంపవలెను——లేకపోయిన——

నేను మాటతప్పని పగటిచుక్కను ! అని సింహాచలము గంభీరముగా జవాబిచ్చెను.

గోవిందంపంతులు మాఱుపల్కలేదు పగటిచుక్కయు రామరాజు వెనకేగిరి.

భటులు వచ్చుచుందురు. మనము మరలఁ జెప్పనక్కఱ లేదు. అని రామరాజనెను.

ఔను. మనమిప్పుడు చంద్రమునంగతి పరామర్శ చేయ వలెను.

ఆమె నీదురాత్మునేమియుఁ జేసియుండదుకదా ?

భగవంతుని కెఱుక—రమ్ము.

పగటిచుక్కయు, రామరాజును శ్రీధరుఁ డద్దెకుఁ దీసికొనిన పెంకుటింటివైపు దారిపట్టి యాచీఁకటిలోఁ జకచక నడచి పోవఁదొడఁగిరి.

---

## ఇ రు వ ది తొ మ్మి ద వ ప్ర క ర ణ ము

---

### మ ఱు న టి రా త్రి 1

అర్ధరాత్రము సమీపించుచుండెను. గర్తపురవువీధు లన్నియు నిర్మానుష్యమై యుండెను. చీఁకటియు, నిశ్శబ్దమునకును బ్రబలస్నేహము. ఈరెండును గలిసి యెట్టి దృఢహృదయము నైన గడగడ వడకింపఁ జాలియుండును. శ్మశానములయందు రాజ్యము చేయునవి యివియే ? పాడువడినగృహముల నేలు నవియు నివియే ? కొండగుహలఁ బరిపాలించునవియు నివియే. ఈద్వయమునకు మనుజులపొడయనిన గిట్టదు. దీపములచే దనను ద్రోలివేయుచురని చీఁకటికిఁ గోపము, సందడిచేఁ దనను భంగముకావింతురని నిశ్శబ్దమునకు—పగ—అందుచేతనే యని

రెండును జనసంచారములవీడి నిర్జనప్రదేశ వసించుచుండెను. అయినను—ఇంతమాత్రంబునం దాము మనుష్యులకు లోంబడిన ట్లొప్పుకొనక యని శాత్రుల—వీలై నంతవఱకు నిర్భయముగాం బురములలోనే వాసము లేర్పఱచుకొనును—

కథాంశాగమునకుం దిరిగివచ్చెదము. పగటిచుక్కయు, రామరాజును సందులుగొందులు గడచి శ్రీధరుని పెంకుటింటిని సమీపించిరి ఆ చీంకటిలో నల్లని మిద్దెపైనుండి యది భయము గొల్పుచుండెను. అంత యంధకారములో సహితము పాడువడిన కళ దానిముఖమున నచ్చొత్తినట్లుండెను.

పగటిచుక్క తలుపును సమీపించెను

వెలుపల వేసియున్న దేమో చూడుము అని రామరాజనెను.

పగటిచుక్క తడిమిచూచెను. తలుపువెలుపల గొళ్ళెము పెట్టంబడియుండెను.

వెలుపలనే వేసియున్నదిసుమా! అని యాతఁడు స్నేహితునితో ననెను.

తాళమా?

కాదు—గొళ్ళెము.

తీయుము.

శకునము మంచిదికాదు. చంద్రము యింటిలో నున్నదా?

ఏమో.

పగటిచుక్క గొళ్ళెముతీసెను. అది ఖంగుమని విపరీతముగ మ్రోగెను.

సింహాచలం! లోనికి వెళ్ళవద్దు. ఆమె పేరఁ బిలువుము అని రామరాజనెను.

సింహాచలము మెల్లగా చంద్రం! అని పిలిచెను.

ప్రత్యుత్తరము రాలేదు.

చంద్రం!—చంద్రం!—చం—ద్రం! అని యొకమారు కంటె నొకమారు హెచ్చుగా సింహాచలము పిలిచెను.

నిరుత్తరము.

మన మనుకొనిన ట్లింటిలో లేదేమో! అని రామరాజు సందేహించెను.

మఱియొక్కమారు పిలిచెను—తలుపుతట్టి.

పిలువుము.

చంద్రం! చం—ద్రం! అనుచు సింహాచలముఁ దట్టబోయెను.

కవాటపురెక్కలు కిర్రుమని లోనికిఁ దెఱచుకొనెను? ఇల్లు చీఁకటిలో బొప్పరుమనుచుండెను.

ఇంకొక్కమారు యత్నింపనిమ్ము అనుచు పగటిచుక్క చంద్రం! చంద్రం! అని బిగ్గఱగా హెచ్చరించెను.

ఆ భయంకర నిశ్శబ్దమే భయంకర ప్రత్యుత్తరము. ఆ కటికిచీఁకటియే కటికి సమాధానము.

శ్రీధరుఁ డామెను హత్యచేసెనేమో ! దుర్మార్గుఁడు ! అని రామరా జనెను.

ఏమో—దీపములేదుకదా ?

నే తెచ్చెద నుండుము.

దీప స్తంభములోనిదా ?

ఔను.

త్వరగాఁ దీసికొనిరమ్ము.

రామరాజు నిష్క్రమించెను. పగటిచుక్క వాకిటి ముందు నిలిచెను. తలుపు లోరగా దెఱువఁబడియుండెను. ఇంటిలో నేమున్నది ? చీకటి. చెప్పరాదు. దానికి మనుష్యునితో బద్ధవైరము. పగటిచుక్క నెవ్వరి నడుగఁగలదు ? దీపమువచ్చిన వెంటనే యెట్టి ఘోరములు బయలువెడలునో—ఏభయంకర ప్రదర్శనము కన్నులకు గోచరమగునో ? చంద్రమేమైనదో ? సుందరియగు చంద్రము జీవించియున్నదా ? లేక యామోహనాకృతి జగమువిడిచి యెగిరిపోయినదా ? శ్రీధరరా వామె నేమొనర్చెను—ఏమి జరిగినది ?

రామరాజు దీపముతోఁ బ్రవేశించెను. అకస్మాత్తుగ నాయింటియందు భాగము విస్పష్టముగఁ గనఁబడజొచ్చెను. పగటిచుక్క వెలుగులో నిలచియుండెను. రామరాజు సమీపించెను. పగటిచుక్క వాకిటకడ్డము తొలఁగెను. వెలుగింటిలోనికి బ్రసరించెను—కన్నులు తిరిగెను. ఇరువురిముఖములును

వెలవెలబోయెను. వారు నిశ్శబ్దముగ లోనఁ బ్రవేశించిరి. ఇల్లంతయు వెలుతురుమయ మయ్యెను. ఆభయంకరప్రదర్శనము—అచటివస్తువులు స్పష్టముగఁ గనబడుచుండెను.

పగటిచుక్కయు, రామరాజును పాలిపోయి గంభీరమైన వదనములతో చంద్రము శవమునెదుట నిలిచిరి. ఆమెముఖముపై చేతిరుమాలుంటచే నది కన్పట్టుటలేదు. దేహము చెక్కుచెదరిన ట్లగపడలేదు. ఎచ్చటను నెత్తురుచుక్కయైనను లేదు చేతులు, కాళ్ళుమాత్ర మొకమాదిరిగ నల్లబారియుండెను. ఆమెప్రక్కను గ్లాసుపడి యుండెను. దానిలో తడిలేదు. ఆ కెంపుహారము సగముచాపపైనను సగముక్రిందను బడియుండెను. ఇతరవస్తువు లేవియుఁ గదలింపఁబడినట్లు లేదు. దీపపుబుడ్డి గోడప్రక్కనఁ బడియుండెను. నూనె నేలపై గారి యింకిపోయిన మచ్చ కన్పట్టుచుండెను.

పగటిచుక్క వంగి చంద్రము ముఖముపైని చేతిరుమాలు విప్పెను. ఆవదనము భయమనునది పగటిచుక్క మొదటిసారి తెలిసికొనెను. రామరాజు తటకాపడి చూడఁ జొచ్చెను. చంద్రము వదనము మిక్కిలి నల్లవాఱియుండెను. దంతములు నీలికప్పు వేసిపోయి గట్టిగా కఱచుకొనెను. పెదవులు బొగ్గులవలె నాయెను. కణతలపై నెత్తురునాళములు నల్లత్రాళ్ళవలె నుబికెను. శిరోజములు చిందరవందరయాయెను కన్నులు నుండి బూడిదయైనట్లుండెను — పగటిచుక్క

తటాలున నామె ముఖముపై రుమాలువేసి వెలుపలికి రమ్మని రామరాజునకు సైగచేసెను. ఇర్వురును వెలికివచ్చిరి. పగటి చుక్క తలుపుమూసెను.

దీపమార్చివేయుము! అని యాతఁడు మెల్లగా ననెను.

రామరాజు దివ్వె నార్పెను. మరల గాఢాంధకారము.

రామరాజు! రమ్ము చంద్రమునుగూడ గర్తపురమున కప్పగించినాము రమ్ము అని దీనముగా ననెను.

ఇరువురును నడువఁజొచ్చిరి.

కొంతదూరము చనినతరువాత పగటిచుక్క యిట్లనెను. 'అయిపోయినది' చంద్ర మదృష్టవంతురాలు! ఆమె మన స్ఫూర్తిగా మరణించినది ఆత్మహత్య — శ్రీధరరావు ప్రబోధించియుండును. నీ వేమనుకొనెదవు?

నేను నీయభిప్రాయము నంగీకరించుచున్నాను. ఆమె విషము పుచ్చుకొనిన ట్లున్నది—ఆగ్లాసు!

పగటిచుక్క మరల యోజింపఁజొచ్చెను. నిశ్శబ్దముగా వారు కొంతదూర ముపక్రమించిరి.

మూడవశవము! దీని నేమి చేయుదము? అని రామరా జడిగెను.

ఆశవమువలెనే దీనిని పూడ్చివేయింతము — బలరాం పేటలో మన మేడవెనుకనున్న తోటలో నీమెను విడిగా భూలీన మొనర్తము.

ఇప్పు డా యేర్పాటులు చేయుదము ?

వెంటనే.

ఏమ్మాట ?

జేవు లక్ష్మీపురమునకు వెళ్ళుపర్పాటు లొనర్పవలెను.

మనగుంపు నెప్పుడు చీల్చివేయుదము ?

నేటిరాత్రియే. గొప్పగొప్ప బహుమానములిచ్చి మన సేవకులవిశ్వాసమును పొందుదము

సరే

ఇరువురును జకచక బలరాం పేటవైపు దాసరిరి.

---

ముప్పదియవ ప్రకరణము.

---

## అన్న — చెల్లెలు

ఇట్టి విపులగ్రంధములయందు ప్రతివిషయము విశదముగా వర్ణింపఁజాలము గ్రంధవిస్తరభీతి ప్రతివారికిని సామాన్యమే. కావున పగటిచుక్క గర్తపురము కడనారి పడుచుటకు ముందచట జరిగిన విషయములు క్లుప్తముగాఁ దెలిపెదము.

మున్ముందు హత్యలవిషయము వ్రాక్రుచ్చెదము శ్రీధరుని శవమును, ఆర్ముఖము కళేబరమును మిక్కిలి రహస్యముగా రాధాయమ్మ మేడవెనుక గోతులయందు. పాతిపెట్టబడియెను. మేడ పై భాగము పరిశుభ్రము చేయబడెను రాధాయమ్మకు

గాని తదితరులకుగాని లేశమును సంశయములేకుండ పగటిచుక్క పనులు జరిగించెను. తరువాత చంద్రుఁడు దేహ సహితము బలరాంపేటలో తనమేడ వెనుకతోటలో నతిగూఢముగా నాతఁడు పాతిపెట్టించెను ! రామరాజు శ్రీధరునిల్లు వెదకి యనుమానాస్పదములగు కాగితము లున్న వేమోయని చూచెను. అట్టిదేవియు నాతనికి దొరకలేదు.

పిమ్మట బలరాంపేటలోని మేడలో నొకసభ జరిగెను. దానిలో బగటిచుక్క గుంపులోని వారందరు నుండిరి. పగటిచుక్క పెద్దయుపన్యాసమిచ్చి తా నధికారముచాలించుకొనుచున్నట్లును—కేవలము హృదయపూర్వకముగా మాత్రము కాదనియు నొక్కి చెప్పెను. అందరును దమతమఖేదము బహువిధములఁ దెలియఁజేసిరి. వారు మిక్కిలి విచారించిరి సహజమే పగటిచుక్కవంటి ధీమంతుఁడును—సజ్జనుఁడును—దానపరుఁడును వారికి మరల లభింపడని వారి దృఢవిశ్వాసము తరువాత రామరాజును, పగటిచుక్కవలెనే, తన మంత్రిత్వము తానదే కారణముల వలనఁ ద్యజించుచున్నట్లు తెలిపెను. మరలఁ గొంత కలవరము జరిగెను మరియొకనిఁ బగటిచుక్క యధికారము కేర్పాటు చేయునట్లు సింహాచలము చెప్పెను. అప్పుడు కొంతచర్చ జరిగెను. అందఱు నేకగ్రీవముగాను— పగటిచుక్క రామరాజుల పూర్ణసమ్మతముతోడను—తురేమోంహాక్ అను వానిని క్రొత్త నాయకునిగా నేర్పఱచిరి.

పగటిచుక్కయు, రామరాజును తమ నమ్మిన బంటు లకు గొప్పగొప్ప బహుమానముల నొసఁగిరి. తురేమోహాన్ శిరముపైఁ బగటిచుక్క స్వహస్తములతో సంధి కారసూచక మగు కిరీటము నుంచెను. భటులు కరతాళధ్వను లొనర్చిరి. ఈక్షణమునుండియు తురేమోహాన్ పగటిచుక్క—మఱి పగటి చుక్కయో? అతని నిఁకముందు జస్వంతరావని పిలిచెదను. తురేమోహానుఁడు పగటిచుక్కయను బిరుదముంచుకొనియే తీరవలెనను కట్టుబాటులేదు. ఆతఁడు దానిని మార్చుకొన వచ్చును కాని పగటిచుక్క తనయధికారముతో బాటు పేరు కూడ అవఁగా బిరుదుకూడ సమసిన బాగుండునని వచించెను. ఒక్కరును దీనికి సమ్మతింపరైరి. కాని తురేమోహాన్ చెప్పి నట్లు—పగటిచుక్క యనుపేరు నిలిచియే యుండెను.

పగటిచుక్కయొద్దను, తన మిత్రులయొద్దను సెలవుగై కొని జస్వంతరావు రాజ రాజసహితుఁడై రాధాయమ్మయింటి కేగెను. తమ పెండ్లి యెంతపిమ్మట వెంటనే యొకమారును— తరువాత నప్పుడప్పుడును దమను జూచిపోవునట్లు దృఢవాగ్దత్త ముల వారిర్వురియొద్దనుండియు తురేమోహానును, నాతని గుంపును గైకొనినపిమ్మటగాని వారిని వెడలనీయలేదు. వారి ప్రేమకును, విశ్వాసమునకును జస్వంతరావెంతయు సంతసించి కన్నీటితో వారిని విడిచెను. నిష్కపటహృదయుండగు రామ రాజు వేర్వేర నొక్కొక్క స్నేహితుని గౌఁగిలించుకొని,

యెంతయో ప్రయత్నము మీద వారిని వీడ్కొనెను. వారిజన్మ మార్పుజెందబోవుచున్నదని వారిద్దరికిని తేటతెల్లమే

ఓంకారము, నాతనితల్లియు నాలుగువేల రూకలోసంగ బడిరి. ఆమేడలోనే వారినుంచుమని జన్వాంతరా వేర్పాటుచేసెను మరల జన్మలో వారిని జూచుటకు నెవ్వరును రాదలంచు కొనలేదు. దారులు చీలెను. ఓంకారము, నాతని తల్లియు నగర పురము విడుచుట కంగీకరించిరి. రాధామయ్యయు శ్రీముఖియు, పురము నాదినము విడుచుటకు దగిన ప్రయత్నములు చేసికొనిరి. మఱునాడు డీగుంపు—అనగా జన్వాంతరావు, రామరాజు గోవిందపంతులు, రాధామయ్య శ్రీముఖి—నీ రైదుగురు 'రైలు' లోనెక్కి లక్ష్మీపురము బయలుదేరిరి.

సాయంసమయమాయెను. లక్ష్మీపురములో ధారా మందిరము నందున్న పూలమొక్కలనడుమ కొయ్యబల్లపై మాణిక్యమును, పద్మయు—(ఇక లలితయను మారుపే రుపయోగింపము) గూర్చుండి సంభాషించుచుండిరి. మాణిక్యము జన్వాంతునితల్లిని ధారాళముగ 'అత్తా!' అని సంబోధించు చుండెను. వారు పువ్వులలో జాతులను వానిలోని చిత్రములను సుందర వర్ణములను— సుకుమార రూపములను— సుగంధ విశేషములను గూర్చి ప్రసంగించుచుండిరి. ఆసమయమున మిక్కిలి తలవనిదలంపుగ జన్వాంతరా వట కేతెంచెను. వారిద్దరు నాశ్చర్యముతో లేచిరి— నిరాంత పడినట్లు కన్పట్టు

చున్న వారిని జూచి శాంతముగా నవ్వుచు జన్వంతరావు తలవని తలంపా? అని అడిగెను.

మిక్కిలి! అని మాణిక్యము చెంగుచెంగున నాతనిసన్నిధికి వచ్చెను.

నిజముగా నింతత్వరలో వత్తునని నే ననుకొనలేదు! అని పద్మ కుమారుని సమీపించెను.

జన్వంతరావు వారినుభయులం దగురీతిని సమాదరము కావించి యిటనెను 'అవునమ్మా నేను వెళ్ళి సుమారు వారము దినములైనది. తలపనితలంపేసుమా! మీరందు మిక్కిలి నేనెట్టి శుభవార్తలు తెచ్చియుంటినో మీకెఱుక లేదు.

చెప్పుడు—పద్మ యాత్రముగా ననియెను.

మనవిరోధు లిద్దరును మనబంధువులే; అని జన్వంతరావనెను.

ఎట్లు గోవిందపంతులు కూడ?

ఔను—ఆతఁడు—మాణిక్యం; నీకన్నతండ్రి గోవిందంపంతులు.

ఆశ్చర్యాతిశయమున మాణిక్యమును, పద్మయుఁ గూలబడిరి. మబ్బులులేని పిడుగైన నంతయాశ్చర్యమును గలిగించి యుండదు.

ఎట్లు? ఎట్లు? జన్వంతా! త్వరగా చెప్పుము నన్నెంపుడు కత్తెగాఁ గొని నాయావన మపహరింపఁజూచిన పురుషోత్తము

రావు—వాంగపేరు పెట్టుకొనిన గోవిందపంతులు—నా—నన్ను—కన్నతండ్రియా?

పద్మిమాణిక్యం! అవును. ముమ్మాటికిని అవును. మఱి మాతల్లిపేరు చెప్పిన నీవాశ్చర్యమున నేమగుదువో?

భగవంతుఁడా! ఆమె యెవ్వరు?

నీవెఱిఁగినస్త్రీయేసుమా!—రాధాయమ్మ.

నిజముగా మాణిక్యమునకుఁ బిచ్చియెత్తినట్లుండెను. పద్మ విభ్రాంతితో, తనకుమారుని మనస్సు చెదరలేదుగదా యని శంకించుచు భగవంతునికి మ్రొక్కుకొనుచుండెను.

సరిగా నాసమయమున రామరాజు వచ్చెను. అది జన్వంతుని యేర్పాటు. జన్వంతరావు తల్లితో అమ్మా! మీ రిద్దఱు రామరాజువెంట నరుఁగుడు. నేను మేడపై కేగి మధుసూదనరావుగారితో యీచరిత్ర యంతయుఁ జెప్పి వారిని బంధువులనమాదరింప నాయత్తముచేసెదను.

వామనరావును పైననేయున్నాడు అని పద్మ చెప్పెను.

మఱియు మంచిది.

కాని, మేము రామరాజుతో నేగుట యెక్కడికి?

ప్రస్తుతము గోవిందంపంతులు మొదలైనవా రున్న బసకు.

రామరాజు బండి సిద్ధముగ దెచ్చియే యుండెను. పద్మయు, మాణిక్యము నాశకట మధిరోహించి రామరాజుతో వెడలిరి. జన్వంతరావు మేడపై కరిగెను.

మధుసూదనరావును, వామనరావును జన్వంతరావు రాకకు మాణిక్యము, సన్మతినలెనే మిక్కిలి వింతచెందిరి. జన్వంతరా వాసీనుఁడై యిట్లనెను

తలవనితలంపుగా రావలసివచ్చిది—ఇంకను దాచనేల? మాణిక్యము అసలు తల్లిదండ్రులు దొరికినారు?

మరల నందఱుముఖములు తేసి పిడుగుపడినట్లయ్యెను. జన్వంతరావు వారికోరికమీఁద జరిగినసంగతి—అనఁగా మాణిక్యము తల్లిదండ్రులవిషయము తానెట్లు కనుగొన్నది వారికిఁ బూసగ్రుచ్చినట్లు తెలిపెను—కాని తండ్రి గోవిందపంతులని చెప్పక 'ఒకపురుషుఁడు—ఒకపురుషుఁడు' అని దాఁచిచెప్పెను. కారణము చదువరు లూహించుకొనియే యుందురు. నిజముగ మధుసూదనరావు తామనుకొనినట్లు సతారాషేఠ్యైన—గోవిందపంతులు మాణిక్యముతండ్రి యనుసంగతి తెలియుటతోడనే తనగుట్టు బయటపడుననియు—గోవిందపంతులు తనను గుర్తించుననియు ననుమానపడి తప్పించుకొనువేళ వాలోచింప వచ్చును అట్లుగాక యాకస్మికముగా వారొండొరుల జూచుచు తటస్థించినసంగతులు ఏమాంతటనే వెలువడునుగదా. ఈమూరాలోచనతో జన్వంతరావు గోవిందపంతులుపేరు దాచెను. మాణిక్యముతల్లి రాధాయమ్మయనియు నామె నిజనామము అలికుంతల యనియుఁ దెలిపెను.

మధుసూదనరావును, వామనరావును మిక్కిలి వింత

చెంది తమ నూతనబంధువుల నెప్పుడు చూడనగునాయని వేచి యుండిరి. కొంతసేపు వారు ప్రసంగించుచుండ నింతలో వెలుపల బండివచ్చిన మ్రోత వినవచ్చెను. జన్వంతరా వాగదిలోని పెద్దజ్యోతి వెలిగించి క్రొత్తచుట్టముల నీగదికిం దెత్తునా ? అని మధుసూదనరావు నడిగెను.

తెమ్ము—అభ్యంతరమేమి ?

మాణిక్యముతండ్రి కూడ నున్నాడుగదా ? అని వామనరా వడిగెను. తల్లిని నేను గుర్తింపగలను

ఉన్నాడు—చూచెదరుగాక ! అని జన్వంతరావు మేడ క్రిందికేగెను.

అచిరకాలములో నెల్లరు మధుసూదనరావుగది ప్రవేశించిరి. కాని యిచట పగటిచుక్క కలలోనైన దలవనివియు—ఎవ్వరు నెప్పుడు ననుకొననివియు నగు కొన్ని మహాద్భుతములు జరిగెను.

ముందు జన్వంతరావును, తరువాత గోవిందంపంతులును మేడపై గది ప్రవేశించిరి. గోవిందంపంతులు మధుసూదనరావు చూచుటతోడనే తెల్లవోయెను. అతనిజూచుట యాలస్యముగ గోవిందంపంతులు ముఖమును పాలిపోయెను.

స—తారామా! అని గోవిందంపంతు లనెను.

గో—విం—దం—అని మధుసూదనరావు మాట ముగింపకమునుపే రాధాయమ్మ యాగది ప్రవేశించెను. ఆమెను

జూచుటతోడనే మధుసూదనరావు నిర్ఘాంతపడి మాటాడలేక శయ్యపై వ్రాలెను.

రాధాయమ్మ యాతని స్పష్టముగాఁ జూచి కెవ్వున కేక వేసెను.

అన్నా! సతారాం! అన్నా! అన్నయ్యా! అనుచు నామె శయ్యమీఁద బాణమువలె వ్రాలెను.

అలివేణీ! అనుచు సతారా ముచ్చరించి చెలియలును గౌఁగిలించుకొనెను. అచటనున్న యెల్లవారు దిగ్భ్రమజెందిరి.

---

## ముప్పదియొకటవ ప్రకరణము

---

### బీరకాయ పీచు

మనమెల్లరము సామాన్యముగా సంబంధములవిషయము వచ్చినప్పుడు—సంబంధములు మిక్కిలి దగ్గఱవై నపుడు 'బీరకాయపీచు' అనుమాటను వినియున్నారము. బీరకాయ పీచు చీకిరిబీకిరిగ నల్లుకొని మిక్కిలి చిక్కుగాను, ఒకొక్క ప్రత్యేకపు నారమునకు మిగిలినవానితోఁ జెక్కుంటితో నాత్మ బాంధవ్యము నుండును. ఆప్రకారమే మనమొక పెద్దకుటుంబ మును దీసికొని బీరకాయతోఁ బోల్చవచ్చును. ఆకుటుంబ ములో నొకఁడొకరికి బాంధవ్యమొకవిధమును మించి, యెల్లరు

నొకరికొకరు కడుఁగూర్చు చుట్టములైనపుడు మనము కుటుంబ బాంధవ్యముల విశదీకరించుచో 'బీరకాయ పీచు' ను వాడుదుము.

ఇప్పుడు జస్వంతరావుకుటుంబము నట్లగూడెను. వారిలో నొకరి కొకరికి నొకవిధముగకంటె జుట్టరికె మేర్పడెను. మధుసూదనరావును దీసికొనిన—నాతఁడు జస్వంతరావుభార్య పెంపుడుతండ్రి, అసలు మేనమామ, గోవిందంపంతులుకొక్క ప్రాఁతస్నేహితుఁడు నై యుండెను. ఇట్లే మిగిలినవారి నొక్కొక్కరఁ దీసికొని చూచిన ననేక సంబంధములు బయలు వెడలును.

అచటనున్నవారిలో 'కన్నపుదొంగ' చదువనివారు లేరు. పదునాలేండ్ల క్రిందటఁ బ్రచురింపఁబడినను ఆపుస్తకములోని యంశములచటివా రెవ్వరును మఱవలేదు. అలివేణి సతారాము చెల్లెలనియు, సతారాము గోవిందంపంతులు కన్నపు దొంగ యగు జనార్దనరావు హస్తద్వయమని వారెఱుఁగుదురు గోవిందంపంతులు, అలివేణియు, విచారణసమయమునఁ బలాయనముచేసినసంగతియు నెల్లరునెఱుఁగుదురు. సతారాము ఆజన్మద్వీపాంతరవాసశిక్ష విధింపఁబడియెను కాని సుమారైదు సంవత్సరములక్రిందట నాతఁడెట్లో తప్పించుకొనివచ్చెను. ఆతని బట్టి యిచ్చినవారికి బహుమాన మిత్తుమని దొరతనమువారు ప్రచురించిరి. కాని సతారా మెవరికిఁ దెలియకుండ లక్ష్మీ

పురములో మేడకొని యచట మధుసూదనరా వనుపేర నివసించు చుండెను.

అలివేణియాశ్చర్యమునకు మేర లేదు. గోవిందంపంతులు రంగూన్ వాసియనియు, దనయున్న—కన్న పుదొంగకు వహా ధ్యాయియనియు నామె యెఱుగును కాని యామె యాతని నెప్పుడును జూచియుండ లేదు. అందుచే నిట్టిచిత్రము జరిగెను. పారిపోయినవా రిద్దరును క్రొ త్తలోనే కలిసికొనిరి ఒకరి నొక రెఱుఁగుదురు. మొన్న పగటిచుక్క గర్త పురములోఁ దమను గుర్తించి మాణిక్యముతల్లిదండ్రులనుగా దెలిసినప్పుడాతఁడు గోవిందంపంతులును నా పేరునే సంబోధించెను. కాని యాతఁ తర పాటులో నామె యావిషయము గమనింపలేదు. ఒకవేళ గమ నించినను రంగూను గోవిందంపంతులితఁడని యామెయెరుగదు.

ఈశ్వరకృత్యములచిత్ర మేమనవచ్చును? లవనందేహము లేక రాధాయమ్మయుఁ బురుషోత్తమరావు ననుపేరుతో నొకరి నొకరు వినికిమూలమున నెఱిఁగిన అలివేణియు, గోవిందం పంతులు ప్రచండనాటక మాడుచుండిరి. ఏగోప్య నెఱుగకయే మధుసూదనరావుపేర నతారాము లక్ష్మీపురములోఁ దనతొల్లిటి కూఁతును జెంపఁ జొచ్చెను. స్వల్పానుమానమును లేకయే జన్వంతరావు తనవిరోధుల బంధువురాలగు మాణిక్యమును ప్రేమింపఁజొచ్చెను. మాణిక్యమును, శ్రీముఖియు నక్కచెల్లెం డ్రను వంశయుఖ్య లేకయే జన్వంతరావు రామరాజు వారినిఁ ప్రేమించుచుండిరి.

ఇంతలో వింతగ జన్వాంతరావు తానే లోకనాధుండగు పగటిచుక్క యని మధుసూదనరావునకు, వామనరావునకును దెలిపెను. కొంతకాలము వారీవిషయమును నమ్మజాలరైరి. నవ్వుడు జన్వాంతరావు తానే చోరనాధుండే యని దృష్టాంతములచే నిర్ధారణపరచెను. అవింత కొంత యడిగినపిమ్మట జన్వాంతరావిట్లనెను 'కర్తవ్యమును గూర్చి విచారింపవలసియున్నది. కాని యీసంగతి తేల్చుటకు ముందు క్లుప్తముగా నతారాము గారును అలిజేణియు, గోవిందంపంతులును దమతమ చరిత్రలం జెప్పిన మాకుద్రేకమును—అభిలాషయుం గొంత దీరును' దీని కెల్లరు సమ్మతించిరి. నతారాము ముందు చెప్పెను. అతని వృత్తాంత పర్యవసానమును, మిగిలినవారి చరితముల సారాంశములమాత్రమిందు మేము మాస్వంతవాక్యములనిచ్చుచున్నారము—అదియు మిక్కిలి క్లుప్తముగ.

నతారాము అండమాను ద్వీపములలోం బదేండ్లపాటు తనగడ్డి తాను తినెను. పిమ్మట నాతనికొక్కనితో ప్రాణస్నేహమయ్యెను. ఆతని కొక ధననిధానమున్న ప్రదేశము రెండు సంవత్సరములనుండియుం దెలిసియుండెను దానిసాయమున నెట్లయిన వారిద్దరు తప్పించుకొని నదను వేచియుండిరి. ఎట్టకేలకొక దొంగపడవలో వారెక్కి ధనముతోంగూడం బలాయన మొనర్చిరి. హిందూదేశములో దిగినపిమ్మట వారు ధనము పంచుకొని విడిపోయిరి. నతారాము కొలందికాల

మచట నిచట దాగుచు గడపి — తమపలాయనమునంగతి కొంత మాటుమణగిన తరువాత మిక్కిలి ధైర్యముగ లక్ష్మీపురములోని తారామందిరమునుగొని, చేరికని ననువానము లేకుండ నందు వసింపజొచ్చెను. తరువాత సంగతు లందరికిఁ దెలిసియే యున్నవి.

గోవిందపంతు లట్లు విచారణ కాలమునఁ బలాయన మొనర్చి, కొంతధనంబుతో పురంబులఁగుమ్మరుచు మల్లాపురములో అలివేణితోఁ బరిచయము చేసికొని యామెతోఁ గొన్ని దినములు గడపెను. తరువాత నాతఁడు కనకపురముచేరి యచట నొక గృహమును, దానికి బశ్చిమమున దానరివల్లిలో నొక మిద్దెయుఁ గొని యిచట నచట నివసించుచు, అర్ముఖము నుబుసుపుచ్చుచుండెను. పిమ్మటఁ దలవనితలంపుగ నాతనికి నోంకారముతోఁ బరిచయమై మాణిక్యము నమ్ముదురని తెలిసెను. ఆబాలిక నుంపుడుకత్తెగాఁ గొనుటకై యాతఁడు గర్తపురములో రాధాయమ్మయింటి కేగెను. అచ్చటినుండియు జరిగినవృత్తాంతము లిందు విశదీకరింపఁబడియే యున్నవి.

రాధాయమ్మగా గర్తపురమున నివసించిన అలివేణియుఁ దనకాలము సంచుమించుగా గోవిందపంతులవలెనే పుచ్చెను. మల్లాపురములో నామెకు గోవిందపంతులుతో స్నేహమాయెను. పిమ్మట నామె తనసంతానమును (మాణిక్యమును) వామనరావుగారి వాఁతనువైచి గర్తపురములేచివచ్చెను.

అచ్చట ఓంకారముతోఁ బరిచయమై యామె యాతనివలన శ్రీముఖుని గనెను. పిమ్మట నామెయు జ్వాలయు ఓంకారమును గలిసి జవ్వనుల బాసినలుగ నమ్ము పన్నుగడపన్ని యిర్వుర దొంగిలించి తెచ్చి, యమ్మి, దనముఁ గూర్చి, మేడనుగొని, యందు వసించుచుఁ దమవృత్తిని సాగించుచుండిరి. తరువాత మాణిక్యము నెత్తుకొనివచ్చుట దగ్గఱనుండియు జరిగినసంగతులు చదువరులకుఁ దెలియును.

ఇప్పుడు చదువరులకొక సందేహము తోచవచ్చును. ఇట్టి అలివేణి కూఁతును పెండ్లాడ జన్మాంతరా వెట్లు నిశ్చయించుకొనెను? మేమిదివఱకే కొంత సమాధాన మొసఁగియున్నారము. జన్మాంతరావునకు గుణమే ప్రధానము—మీఁదుమిక్కిలి తనజన్మకు మాణిక్యము బాధ్యురాలా? విశేషలోకానుభవముగలవారి కిట్టియనుమానములు త్రుటిలో నశించును.

పగటిచుక్కను దనవృత్తాంతము చెప్పుమని యుచటివారు బలవంతపెట్టిరి—అనఁగా దాను పగటిచుక్కయగుట—అది గాగలవిషయములు కాని జన్మాంతరావది సమయముకాదనియు, దరువాత సావకాశముమీఁద జెప్పెదుననియుఁ దప్పించుకొనెను. విషయమేమన—నాతఁడు వారికి తమ చోరనాథుఁడుగా నున్నప్పటి ప్రవర్తనఁ జెప్పఁదలఁచికొనలేదు. దానితో చంద్రం, శ్రీధరుల విషయములు రావలసివచ్చునని యాతనికి బాగుగాఁ దెలియును. అందుచేఁ బిమ్మటఁగూడ నాతఁ డెన్న

డును, వారికావిషయములు, తదీయరహస్యమును జెప్పనేలేదు. మాణిక్యము సహితము వాని నెఱుంగదు.

పగటిచుక్క యుద్యోగముతో సాసంబంధ రహస్యములు సమసెను.

---

## ముప్పదిరెండవ ప్రకరణము

---

### భవిష్యత్తు

సతారామునకున్న భయము నశించెను. అచటివారందఱును దనహా ప్రకోటియే. ఇంక దనగుట్టు బయటపెట్టువారెవ్వరు? వామనరావును, మాణిక్య శ్రీముఖులును దక్క యచటివారందఱును దొరతనమువారి విరోధులే. సతారామును, పగటిచుక్కయు, రామరాజును, అలివేణియు, గోవిందంపంతులును—ఈ యైదుగురును నేదోవిధముగ దొరతనమువారి యెదుట నపకారముచేసి— అనగా ప్రజలకని శాత్పర్యము వారిచే బట్టువడిన శిశులపాలు కావలసినవారలే. పత్ని మాత్రము పగటిచుక్క తల్లియనుట కంటె నేవిధముగను నిందార్యాలుకాదు. కాబట్టి తమగుట్టు నితరులు బయటపెట్టుదురేమో యని యెవ్వారికిని భయములేదు. అందఱు ధైర్యముగా నుండిరి. అప్పుడు పగటిచుక్క యను పేరు కొంతక విసర్జించినట్లు నిశ్చయించి యన్యాంతరా విల్లనెను.

మన యీచరిత్ర పెద్దకాటకమువలె నున్నది. దీనిని గురించి యింత చెందుటకును సవ్వరించుకొనుటకును నిఁకయుండుఁ జాలగాలమున్నది. ప్రస్తుతము భవిష్యత్తును గూర్చి యోజింప వలసియున్నది.

అవును—ముఖ్యముగా, అని సతారా మనెను.

మనమింక లక్ష్మీపురములోఁగాని, యీచుట్టుప్రక్కల గాని యుండుట పొసఁగదు. క్షేమకరముకాదు. కారణము మనలోఁ బెక్కురు దొరతనమువారి కనుమానాస్పదుల మగుటయే.

ఈపురము—చుట్టుపట్ల పట్టణములు ఎంత త్వరలో విడిచిన నంతమంచిది. అని సతారాము దృఢముగాఁ జెప్పెను.

నీవేమైన నాలోచించియుంటివా? అని వామనరావు ధన్వంతరావు నడిగెను.

యోజించియుంటిని. నావాక్యములెల్లరు నేకకంఠముగా నంగీకరింతురుగాక. ఈక్షణమునుండియు మనమెల్లర మొక్క కుటుంబములోనివారము. ఒక్క యింట నుండవలసినవారము. మరణముతప్ప మనల నేదియు జీల్చివేయలేదు. నేఁటినుండియు మన మొండొరుల నెడబాసి యుండఁజనదు. కోయంబత్తూరు మన భావి నివాసస్థానము. అచట నొక గృహము విలువకుఁ దీసికొందము. అందఱమును నిఁక వారము దినములనుండి కోయంబత్తూరు నివాసులమగుదము. నేను వెడలి గృహము

కుదిర్చి వచ్చెదను. రామరాజు నన్ననుసరించును. మిగిలినవా రిచటనే యుండుదుము. మఱియొక విషయము గోపి-దంపంతులు మొదలగువారు ఆజన్మాంతము మాయింట నుండుట కెట్టి సంశయమును బెట్టుకొనగూడదు. ఇక్కడనుండి పగలు విడిచి తిమి కావున నెవ్వరికిని ననుమానముండదు. సతారాముగారు ధనికుడు. భగవదనుగ్రహమువలన నాకును రామరాజునకును గూడ నైశ్వర్యమునం దెట్టికొఱతయు లేదు. అందుచే నెవ్వరును మన్నగడల కభ్యంతరము చెప్పగూడదు.

ఎవ్వరును నభ్యంతరము చెప్పలేదు. చెప్పుటకు వీలులే దనియు, జన్వంతుని యుపాయము సమంజసమైనదనియు నెల్లరు గ్రహించుకొనిరి.

ఎవరికైన సందేహముగ నుండినగాని జన్వంతరావు పురలఁ జెప్పఁజొచ్చెను, ఎవరైన నింతకంటె మంచి యుపాయ మాలోచించినఁగాని నిశ్శంకగాఁ దెలియఁజేయవలెను. సతా రాముగారు పెద్దవారు వామనరావుగారు యోగ్యులు. మీకే మైనఁ దోఁచినఁ దెల్పుఁడు.

వయస్సునకు పెద్దనుగాని నాయునా, బుద్ధికి గానుసుమీ, సతారాము సమాధానము చెప్పెను. నీవన్నగడకు నాకెట్టి యాటంకమును లేదు. నాయిరువురి మేనకోడళ్ళదగ్గఱ నుండుట కంటె నాకు వేఱుసంతోషము లేదు. నీయుపాయమే సరి.

నా యభిప్రాయము నంతే అని వామన రావుగారు చెప్పెను.

జన్మాంతరా పేట్లనెను. 'మంచిది. అయిన జేవు, ఎల్లుండి లోగా మేము కోయంబత్తూరు ప్రయాణము మీరు జాగ్రత్తగా నుండవలెను.

భవిష్యత్తు తేలినదిగనుక యచటివా రితరవిషయములను జరిగిన చిత్రములనుగూర్చి ప్రసంగించుకొన నారంభించిరి. అవి చదువరులకుఁ దెలిసినవిషయములే యగుట నిచట వ్రాయక విడిచివేయుచున్నారము.

---

## ముప్పదిమూడవ ప్రకరణము

---

### "సెలవు!"

మాయాచిత్రచరిత్ర సమాప్తమైనది. మానాటకములో నైదవ యంకములోఁ జివరరంగ మాడుచున్నారము. ఈ ప్రకరణముపేరు 'సమాప్తము' అని పెట్టిన బాగుగనుండెడిదని నామిత్రులు కొందఱభిప్రాయముపడి నాకుఁ దమ యుద్దేశమున దెలిపిరి. కాని 'సెలవు' అని పేరుపెట్టనే పెట్టినారము. కాఁబట్టి మా చదువరులయొద్ద 'సెలవు' పుచ్చుకొనుచున్నారము. ఓంకారమును, జ్వాలయు, కర్పూరములోనే యుండి తమ జన్మలో మరల నెప్పుడును తామొకప్పుడెత్తఁగిన మనపాత్రలఁ గాదఁటేమ. వారు రాధాయమ్మ మొదలగు వారియొద్దఁ బెద్ద 'సెలవు' గైకొనిరి.

మా నవల లక్ష్మీపురనములో ముగించు చున్నారము. కోయంబత్తూరు వెళ్ళుటకు ముందొక నాటిసాయంకాలము రామరాజును, శ్రీముఖియు నొకగదిలో విలాసముగ సంభాషించుకొనుచుండిరి.

ఇప్పుడు తెలిసినదిసుమా? అని శ్రీముఖి నగు మొగము తోడ ననుచుండెను. 'పగటిచుక్క యెట్లు చిత్రముగా మా గృహాము ప్రవేశింపఁజాలెనో యిప్పుడు నాకు బోధపడినది.'

ఎట్లో? అని రామరాజు మందహాసముతో నడిగెను.

నీవే కారకుఁడవు

అబ్బా! యీనిందయేమి?

నేను నీకొక తాళపుచెవి నిచ్చితిని. దానిమూలమున నీవు ప్రహారీద్వారము కడచి, తోటదాటి మామేడవెనుకకు వచ్చుచుండెడివాఁడవు అచ్చటినుండి మఱియొక చిన్నితలుపు తాళపుచెవితోఁ దెఱచి నీవు మేడ కొన్నిసమయములందుఁ బ్రవేశించుచుండెడివాఁడవు ఇంకను తెలియదా?

తెలియుటలేదు. అని రామరాజు చిఱునవ్వునవ్వెను.

తెలియుటలేదు? అవునా? అనుచు శ్రీముఖి యాతని విలాసముగాఁ జెక్కిలి పైఁగొట్టెను. "నీవు టక్కరివు. పగటి చుక్క కుడిచేతిని. ఆతాళపుచెవి పగటిచుక్క కిచ్చుచుండి యుందువు. ఇంకేమున్నది? నీకు బదులుగపగటిచుక్కమామేడ తలఁచుకొనినప్పుడెల్లఁ బ్రవేశించు చుండెడివాఁడు. ఆతఁడు వచ్చిన దినమున నీవెన్నడును వచ్చెడివాఁడవుకావు. కాదా?

నిజ మూహించితివి! అని రామరాజు సస్మితము సూచించెను.

అసత్య మెన్నిదినములు దాగును? అనుచు శ్రీముఖి సరసముగా ననెను. రామరావానందించి యాజవ్వనిచేయి గ్రహించి, లేతవ్రేళ్ళతో నాడుచు, అసత్యముదాగదు. ముఖ్యముగా నాలుక్కిమెదుట! అనుచు నాకరమును ముద్దాడెను. హర్షమున శ్రీముఖ యాతనికిఁ దనకృతజ్ఞత తెలిపెను.

వేళాకగదిలో పగటిచుక్కయును తన యధికారము నందలి యుద్దేశమేమో తెలుపుచు జస్వంతిరావు మాణిక్యము యొక్క అనుమానములఁ దీర్చుచుండెను.

అయిన దేశము బాగుచేయుతలఁపు మీ సంఘమువారి కేల? అని మాణిక్యమాతని నడుగుచుండెను.

ఈశ్వరకృత్యముల వైచిత్ర్యము మనము గ్రహించు కొనఁజాలము. మన మల్పులము. మన మనస్సు అల్పమది. మనచేష్టలల్పములు. లోకములో నన్యాయము నడఁచి న్యాయము స్థాపింప పరమేశ్వరుఁ డొకొక్కని నేర్పఱచుచుండును. కొంత పాపము నామూలమున శాంతింపఁజేసెను.

అయినను లోకములో నీకువచ్చిన పేరెట్టిది? నీసద్గుణములనందఱు వేనోళ్ళఁ బొగడుచున్నారా? నిన్ను దొరతనవారు పట్టుకొన యత్నించుటలేదా?

నిజమేసుమా. కాని లోకులు పలుగాకులనుమాట దీని కంటె నిజము. లోకము మూయ మూఁకుడుండునా? అనుకొననిమ్ము. జిహ్వకొకరుచి— పుఱ్ఱెకొకబుద్ధి—నాలుకకొక మాట కాని మాచర్యలయందు దూష్యము లేవియు లేవు. మేము కొందఱిని వధించినమాట వాస్తవమే కాని వారా హత్యలకుఁ దగుదురు. అట్టి దుర్మార్గుల నాశనముకొఱకై భగవంతుఁడు

మానంఘమును సృష్టించెను.

కాని, జన్వంతరావ్! నీక్రియల మెచ్చుకొనువారు తక్కువగదా?

ఔను—ఔను జన్వంతరావు నవ్వుచుఁ జెప్పెను. 'ధర్మాధికారిని మెచ్చుకొను చోరులుందురా? యముని శ్లాఘించు పాపులుందురా? కల్ల. కాని యముని కర్మములు నిందనీయములా? ఎన్నటికిని గాదు. తెలిసినదా?

పోనిమ్ము ఆవిషయమై వాదించుకొనఁదలఁచుకొన లేదు.

మరేమి?

లోకములో పాపులనందరిని మనము శిక్షింపఁగలమా?

శిక్షింపలేము.

మఱి!

మాణిక్యం! లోకములో పాపులందరిని మనము శిక్షింపలేము కాని మనను శిక్షించినంతవఱకుఁ జాలును లోకములోని విషకీటకముల—సరీసృపములన్నిఁటిని మనము చంపలేము కాని వధించినంతవఱకుఁ గొంత యుపకారమే యగును. జగములో పాపము తయు నొక్కఁడే చేయఁగలఁడా? పుణ్యమంతయు నొక్కఁడే కట్టుకొనఁగలఁడా? ఎంత ధర్మకార్యములైనఁ జేయుము నీకు వచ్చు పుణ్యము కొంతమాత్రమే! మిక్కిలి స్వల్పభాగము పుణ్యమంతయు నీవార్జించలేవు— ఎవ్వరును జన్మలోఁ జేయఁజాలరు. కాన సంపాదించినంతవఱకు సంతసింతము. ఊరిలోని కల్ల సంపన్నుఁడు ఇతరులను తనతోఁ బోల్చుకొని తన సిరికెట్లుప్పొంగునో యదే ప్రకారము మనము తుష్టి చెందవలెను. ఏమందువు?